# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క
సాంఘిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము


సంపుటము 22 ఫిబ్రవరి 1979 సంచిక 2


## విషయానుక్రమణిక



### చందాదారులు గమనించండి!

మీ చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రికపైనున్న విలాసము గల కాగితము లోనూ తెలుపుచున్నాము. దానినిగమనించి, ఆ నెంబరు "..../-3-79" అనియుండిన, మీ చందా మార్చి నెలలో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥నకు రూ. 6) ఫిబ్రవరి నెల 28 వ తేదీ 1979 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను.

### —: శ్రీవారి కార్యక్రమములు :—

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్ ప్రశాంతి నిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ, రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను. లేదా కొత్తచెఱువు 36 నెంబర్‌కి ఫోన్ చేయవలెను.

---

సంవత్సర చందా 6 రూ॥ గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలెను.


వివరములకు అట్టలోపలి భాగములో చూడండి




భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

ప్రతిజీవియు తన్ను "నేను" నేనని వ్యవహరించుకొనుచున్నది. నేను రామయ్య, నేను కృష్ణయ్య, నేను సీత, నేను రాధ అని యెవరికి వారు నేను నేను అను పదమును ఉపయోగించుకొనుచున్నాడు. అసలు మాటలు రాని కారణముచే పశు, పక్షిమృగాదులు ఈ "నేను" అను పదమును వ్యవహరించలేక పోవుచున్నవి. కానీ మాటలే వచ్చియుండిన అవి కూడా ఈ నేను నేను అను పదమును ఉపయోగించియుండెడివి. అంతేకాక, కొండలు, గుట్టలు, మ్రానులు కూడనూ నేను గుట్ట, నేను పుట్ట, నేను చెట్టు అని వ్యవహరించి యుండెడివి. ఇవంతయూ సూక్ష్మముగా విచారించి చూచిన ఈ నేను అను పదములో యేదో గొప్ప రహస్యము ఇమిడియున్నది. పామరుని మొదలు, పరమాత్మ వరకూ ఈ "నేను" అను పదముచే వ్యవహరించుచున్నారన్న ఈ రహస్యమును యెవర విచారించున్నారు. యెంతమంది విచారించ చున్నారు. పోనీ విచారించి అర్థము చేసుకున్న వారెందరు? పోనీ అర్థము చేసుకొని ఆచరణ యందుంచిన వారెందరు? మహా మహా మేధ వులు, పండితులు, పరమహంసలు సహితమ ఈ నేనను మంత్రమునకు అర్థమేమో గ్రహించ గలిగినారా? లేదు. భగవత్‌గీతను వదునెనిమి ఆధ్యాయములు 700 శ్లోకములూ పూర్తి కంఠ స్థము చేసుకొని ప్రవచనము చేయుచూ ప్రబోధలు సలుపుతూ వాటి బాష్యములు వ్రా మేధావులు సహితము ఈ "నేను" అను పదమ యొక్క పరమార్థమును పూర్తిగా గ్రహిం నారా? గ్రహించి యుండిన "అహం త్వా మోక్ష యిష్యామి" "మామేకం శరణం వ్రజ" "క్షేత్రజ్ఞం చాపిమాం విద్ధి" ఇత్యాది శ్రీకృ

వాక్యములలో నేను నేను అనియే సంబోధించు కొనినాడుకదా ఈ విధమైన నేను అను పదము సర్వత్రా, సర్వ జీవాత్మస్వరూపమే, అనంత రూపమై స్పష్టముగను గోచరించుచున్నది. పూసలలో దారమువలె నామరూపములు భిన్న ములుగా కానవచ్చుచున్ననూ అన్నింటినీ కూర్చిన సూత్రమువలె ఈ "నేను" కానబడు చున్నది. రూపనామములు యెన్ని మారినా ఈ "నేను" అనునది మారక శాశ్వతముగా నిలిచి యున్నది. మొదలు ఈ సర్వవ్యాపకమైన నేను గుర్తించిననే సర్వమూ తెలిసికొనినవాడు కాగలడు. అతడే జగద్గురువు, విశ్వగురువు, సద్గురువు లోకమున ఉపాధి భేధములచే భిన్న, భిన్న భావములను అభివృద్ధిచేసికొని వకడు అంటరానివాడు, మరొకడు అంటతగినవాడు అని వ్యత్యాసముతో వ్యవహరించుట, వకరు గొప్ప, మరొకరు తక్కువ అని వ్యవహరించుట కూడా ఇట్టి దొడ్డబుద్ధికి లక్షణములు కానేరవు. కేవలము పొట్టకూటి విద్యలు అనేకము నేర్చి వాదోపవాదములకు సిద్ధమయినంత మాత్రమున పాండిత్యము అనుపించుకొననేరదు. "నేను" అనుపదము పదార్థములనేకాక సర్వాత్మయగు పరమాత్మను గుర్తించి విచారించు చుంటిమన్నమాట. యిదియే నీవు అని గుండెలను తట్టి చూపించుచున్న విధమున తత్త్వమసి, అను మహోపదేశ వాక్యశబ్దము వకటి వకచెవిని—వినుపించుచున్నది.

యెంతటి శాస్త్రజ్ఞుడయిననూ, స్వతంత్రించి బ్రహ్మజ్ఞానమునకు పూనుకొనరాదు, అనుభవజ్ఞులయిన, ఆచరణరూపులైన మహనీయుల వలననే గ్రహించదగిన విషయములు. ఈ పవిత్రమైన "నేను" అను తత్త్వము, జ్ఞానము తర్క, వ్యాకరణాదులకు సాధ్యమగునదికాదు. ఇవి అంతయునూ శ్రుతి, స్మృతుల హెచ్చరిక సుమా? నేను అను విషయమును పూర్తీ స్థూలముగ చెప్పతలంచిన యెడల మూడు ముక్కలలో తేలిపోవును, నేను పగలు నందు వ్యవహరించుచున్నాను. రాత్రులందు నిద్రించుచున్నాను నిద్రలో కలలు కంటున్నాను. ఇట్లు చేయుచు, చేయుచు చనిపోవుచున్నాను. ఇది వ్యక్తికి గల జ్ఞానమును పట్టి చూచిన ఈ వ్యవహారము "నేను" పుట్టిన పిమ్మటినుండీ ప్రారంభమగును అయితే పుట్టక పూర్వము ఈ "నేను" వుండెనా? వుండియున్నచో, వున్న వస్తువుకు పుట్టుట అనునది వుండదుకదా? పోనీ పుట్టక పూర్వము యెట్లుండెను. ఈ "నేను" యెచ్చటుండెను? దేహాదులకు భిన్నముగ నుండెను? లేక ఇంద్రియములకు అతీతమైయుండెనా? అను సంశయములు అలలుగా చెలరేగును. అసలు "నేను" అనుపదము వక్కవస్తువునకు, వక్కవ్యక్తికి, వక్కరూపనామములకు సంబంధించినది కాదవి స్పష్టమగుచున్నది. కనుక మొదలు "నేను" అను లేక నేనెవరు అనునది గుర్తించిన సర్వ ప్రపంచమును గుర్తించిన వాడు కాగలడు.

సృష్టిలో, ఈ జగత్తులో తెలిసికోదగిన విషయములు అనంతమైయుండగా ఈ "నేను" గూర్చియే తెలిసికొనవలసిన అవసరమేమి?

ప్రపంచమును తెలిసికొనుటకు ప్రయత్నించ వచ్చును కదా ? లేక జీవుని తెలిసికొనుటకు పరిశీలన సలుపవచ్చునుకదా ? పోనీ దేవుని గూర్చి విచారించవచ్చునుకదా, ఇట్టి ప్రపంచ, జీవ, పరమాత్మలు, ప్రధాన స్థాయిని అందు కొన్న మహా విషయములుండగ వీటన్నింటినీ విడచి, నిత్య జీవితములో అమాయకులైన పసిపాపలు కూడా పదే పదే వినియోగించే ఈ "నేను" "నేను" అను ఈ సామాన్య విషయ మును తెలుసుకొనిన వచ్చు ఫలమేమి అని సందేహించవచ్చును. పదము సామాన్యమేకానీ దానిలోని అర్థము, అనంతము, అఖండము. అందుకే ప్రతి మహనీయుడు చెప్పునది ఇదియే. నిన్ను నీవు విచారించుకో, నిన్ను నీవు తెలుసుకో, అపుడే మోక్ష ప్రాప్తికలుగును అని హితోపదేశములు చేయుచున్నారు. శాస్త్రములు హెచ్చరించుచున్నవి. "యద్విజ్ఞానేన సర్వం విజ్ఞానం భవతం" మొదలగు ఆజ్ఞలను పట్టి ఆత్మ విచారణే ముఖ్యమని తేలుచున్నది. ఇట్టి ఆత్మవు నీవేనని "తత్త్వమసి" మహావాక్యము ఉపదేశించుచున్నది. కనుక మీ వాంఛితము ఈడేరుటకు నిన్ను నీవు విచారించుకో. "నీవు" నిత్యుడవనియు, శాస్త్రములు నిన్ను ఆవరించిన అజ్ఞానమును పారద్రోలి నీ స్వస్వరూపమును అనుభవమునకు తెచ్చుచున్నవి. స్ఫురింపచేయు చున్నవి. ఇట్టి పరమ రహస్యమును, పరమ శ్రేయమును బోధించుచూ వచ్చుచున్న శాస్త్ర ములను విశ్వసించక కేవలము మూఢాచార ముల వెంట ముసుగు వేసుకొని పయనము చేసిన ఆత్మతత్త్వమెట్లు అబ్బును? ఆనంద రూపమెట్లు అగుపించును.

శ్రుతి తాత్పర్యము గ్రహించుటకు కేవలము లౌకిక ప్రజ్ఞ మాత్రమే చాలదు. దానిని భక్తి ప్రపత్తి భావములతో భగవద్ కృపను సాధించి అతని కరుణా కటాక్షములచే తెలుసు కొను సుసాధ్యము. మానవుల శ్రేయో ప్రేయ ముల నిర్ణయించ సమర్థులు. దైవ స్వరూపులే అన్యులకు ఇట్టిది అసాధ్యము. తమను తామే తరింప చేసుకోలేని నేటి గురువులు, ఇతరులను యెట్లు తరింపచేయగలరు. ఇల్లు గెలవక రచ్చ లకు దిగే నేటి గురువులు అధికమగుట చేతను అనర్థములు అధికముగా బయలుదేరి వాటికి నానార్థములుతో కలుగపెంచి యధార్థమును అంతుతెలియక చేయుచున్నారు. అసలు శాస్త్ర ములను కూడా తమతమ అనుకూలములకు తగినట్లు అర్థములను సృష్టించి, స్వార్థమునకై వినియోగించుచున్నారు. ఈ పరిస్థితిలో దైవ కటాక్షమే దివ్య ఆదర్శము, అదే దారినిచూపే దేదీప్యము ధన్యుల చేసే దయారసము. దరికి చేర్చే దట్టమైన, గట్టమైన ధర్మనావ.

తన్నుతాను విచారించుకొనుట మోక్ష మార్గ మని అనేక పెద్దలు చెప్పుదురు. కానీ ఈ విష యమునకు తాము స్వతంత్రముగా చూసుకొను చున్నారా? "స్వవిమర్శో మోక్షః" అన్న విష యమునకు అర్థమేమి? అదే ఆత్మ, అదే నేను

నేను, ఆత్మ వేరుకాదు. ఆత్మ, పరమాత్మ వేరు కాదు. నేను అనుదారము సర్వత్రా, పడుగు, పేకగా చేరటముచే అదే ఆత్మ అను వస్త్రముగా రూపొందుచున్నది. ఈనేను, నేను అనుదారములు, దేనికది ఉపాధి భేధముచే వేరయిన ఆత్మ అనువస్త్రమే అదృశ్యమగుచున్నది. సరే, అయితే ఈ నేనను దారము, ఆత్మ అను వస్త్రము దేనికది విడిపోవచ్చును. కానీ ఆ రెండింటియందు చెట్టుచెదరక యేకంగా ఉన్న ప్రత్తి అదే పరమాత్మ, పరమాత్మ అను ప్రత్తి లేక నేను దారము, నేనను దారము లేక ఆత్మ అను వస్త్రము వుండుటకు వీలులేదుకదా? యేతావీతా ఈమూడూ మూడు రూపములు. మూడు నామములు ధరించిన త్రిమూర్తి స్వరూపమే ప్రత్తి అను పరమాత్మ. ఏకాత్మ. దివ్యాత్మ.

# సమత్వం - యోగం

పరమ పావనమైన భారతావని యందు
సహన మన్నదె మనకు చక్కతనము.
వ్రతములన్నిటి యందు వన్నెగాంచిన యట్టి
ఘన సత్య శీలమే కఠిన తపము,
మధుర భావంబేది మన దేశమందన్న
మాతృభావము కన్న మాన్యమెద్ది !
ప్రాణంబు కంటెను మానంబె ఘనమను
మన దేశ నీతిని మంటగలిపి
నేటి కిచ్చిరి - పరదేశ నీతులరసి
వేస స్వేచ్ఛయను - విచ్చు కత్తులౌరా !
ఏ మందు భారత పాలనంబు ?
ఏనుగెట్టుల తన బలము నెరుగలేదో
అట్టులయినారు మన భారతీయులు నేడు ॥

పవిత్రాత్మ స్వరూపులారా !

అనాది కాలము నుండి భారతదేశములో దైవాన్ని అన్వేషించే ప్రయత్నము జరుగుతునే ఉన్నది. దైవము కలదా? అనే ప్రశ్న - దైవము నే విధముగా పొందవచ్చును? అనే ప్రశ్న నేటిది కాదు. సృష్టి మొదలు యిట్టి ప్రశ్నలు మానవుని వేంటాడుతూనే ఉన్నవి. ఇట్టి సమస్యలను పురస్కరించుకుని అనేక మంది మహనీయులు, త్యాగబుద్ధితో, చాకచక్యములతో, నియమనిష్ఠలతో తపస్సు చేసి కట్ట కడపటకు తెలుసుకోగలిగారు. వారు తెలుసుకున్న సత్యమును లోకమునకు చాటుటకు కొంత కృషి సలిపారు

ఏ కోహ మేకం పురుషం మహాన్తమ్
ఆదిత్య వర్ణం తపసః పరస్తాత్ ॥

"ఓ జనులారా! తేజోవంతమై, ప్రకాశవంతమై, దేదీప్యమానముగా వెలిగే పురుషుని మేము చూడగలిగాము. అతనిని దర్శించగలిగాము. అతని దివ్య శక్తిని కనుగొనగలిగాము" అని ఆనాటి మహర్షులు ఎలుగెత్తి చాటారు. ఎక్కడ కనుగొన్నారు? ఎక్కడ

చూడగలిగారు? ఎక్కడ తెలుసుకున్నారు. వెలుపల ప్రపంచము నందా? ప్రకృతియందా? కాదు, కాదు. తమయొక్క హృదయములందే. తమయొక్క అంతః కరణము నందే దివ్యత్వమైన పరమాత్మ తత్వాన్ని తెలుసుకోగలిగారు. దేహము మృణ్మయము - ఆత్మయే చిన్మయము - అన్న సత్యాన్ని లోకానికి చాటారు. దేహము కేవలము ఒక మట్టిముద్ద గానీ, మాంసపుముద్దగానీ కాదు. మరేమిటా? "దేహో దేవాలయః ప్రోక్తో జీవోదేశః సనాతనః" - దేహము ఆత్మకు ఒక దేవాలయము వంటిది. భగవంతుని ఊరేగించుటకు దేహము ఒక చక్కని రథము. రథము లేనిదే రథికుడుండుటకు వీలుకాదు.

చక్రములు లేని రథము
నీరెరువులు లేని పంట
చంద్రకళలు లేని రాత్రి
సింధూరము లేని గృహిణి
వెన్న తీసినట్టి పాలు
రుచి ప్రకాశము లెట్లు కలిగియుండు ?
భక్తి లేని జీవితంబు
పుణ్యమా? పురుషార్థమా? అన్నట్లు

రథికుడు లేని రథముండుటకు వీలులేదు. ఇటువంటి పవిత్రమైన దేహమును మనము అలక్ష్యము చేసి దివ్యత్వమనే ఆత్మతత్వము ఆధారముగానున్న సత్యమును తెలుసుకొనుటకు ప్రయత్నము చేయక కాలమును వ్యర్థము గావిస్తున్నాము. అయితే యీ దివ్యత్వము మనకు ఏ రీతిగా గోచరిస్తుంది ? అని ఒక ప్రశ్న. సూర్యుడు సర్వత్ర ప్రకాశించుచున్నాడు. ఆ కిరణములు చెట్టుపైన, గుట్టపైన, పుట్టపైన అన్నింటి మీద సమముగానే ప్రసరిస్తున్నవి. వీటిమీద పడిన కిరణములు తేజోవంతముగా ప్రకాశింపవు. కానీ అద్దము మీద పడిన కిరణములు శుద్ధంగా సుస్పష్టముగా గోచరిస్తాయి. అదేవిధముగ సర్వత్ర వ్యాపించి యున్న దైవత్వము. చిత్తశుద్ధియున్న ఆత్మ దర్పణము నందే వ్యక్తమవుతుంది. అద్దము నిర్మలముగా నున్నప్పుడే కదా ప్రతిబింబము ఏర్పడుట కవకాశ ముండునది. కాన యీనాడు మనము చిత్తశుద్ధి ఎంత అవసరమో గుర్తించాలి. చిత్తశుద్ధి నిమిత్తమై మనం ఏం చెయ్యాలి? సాధన ఏమిటి? ఎట్టి కర్మాచరణ చేయాలి? స్వార్థరహితమైన కర్మలు, ఫలాపేక్ష లేనటువంటి కర్మలు చేయాలి? దీనిని భగవద్గీత 'నిష్కామ కర్మ' అన్నారు. ఈ నిష్కామకర్మ జేయడంలో మానవుని కర్తవ్యం ఎంతవరకు ఉంది ? "కామికాక మోక్షకామి గాడు" అన్నాడు వేమన. ఫలాపేక్ష లేనుండ ఒక చిన్న పని కూడ చేయడానికి మనము ముందంజ వేయము. ఇటువంటప్పుడు సామాన్య మానవుడు ఫలాపేక్ష లేకుండ కర్మలు చేయుట సాధ్యమా? సాధ్యమే. ఏ రీతిగా సాధ్యము ?

కర్మ సుకౌశలం, సమత్వం యోగం; ఈ రెండింటినీ మనము అవలంబించాలి. సమత్వమే యోగం, యోగమే కర్మ సుకౌశలం, సమత్వమును మనము గుర్తించుటకు ప్రయత్నము చేయాలి. యోగము ద్వారా మానవుడు తనంతట తాను ఉద్ధరింపబడతాడు. భోగముచేత తనంతట తాను సతమతమైపోతున్నాడు. కనుక భోగమా ప్రధానము? యోగమా ఆధారము? దీనిని విచారించాలి. మనము భోగనిమిత్తమై, కాలమును, కాయమును కర్తవ్యమును వ్యర్థము గావించుచున్నాము. యోగము నిమిత్తమై మనము ప్రయత్నము చేయడము లేదు. యోగమే కర్మ, కర్మయే కౌశలము, కౌశలమే సమత్వము. ఇట్టి సమత్వమనే తత్వాన్ని చేపట్టాలి.

యోగమనే తత్వములో ప్రధానముగ ఐదురకములున్నవి.

మొదటిది ప్రకృతి యొక్క సమత్వము.
రెండవది సమాజము యొక్క సమత్వము.
మూడవది జ్ఞానము యొక్క సమత్వము.
నాలుగవది కర్మ యొక్క సమత్వము.
ఐదవది భక్తి యొక్క సమత్వము.

ఈ ఐదింటిని మనము కొంత విచారించాలి. ప్రకృతిలో శీతోష్ణముల వలె సుఖదుఃఖములు మానవుని వెంటాడుతుంటాయి. జగత్తులో శీతోష్ణములు లేక సుఖ దుఃఖములు లేక మానవుడు జీవించుటకు వీలులేదు. సుఖదుఃఖములు చీకటి వెలుగులవలె ఉండును. అయితే దీనిలో మనము ఏ విధముగా సమత్వాన్ని పొందాలి. ఒక కాలమందు ఉష్ణము మనకు హాయిని కలిగిస్తుంది. ఒక కాలమందు చలి హాయిని అందిస్తుంది. కావున శీతోష్ణములు రెండును మానవునికి మేలు చేస్తున్నాయే కానీ కీడును కలిగించడం లేదు. ఈ విధంగా మనము సుఖ దుఃఖములను సమ చిత్తములో స్వీకరించాలి. కానీ మానవుడు తన అవసరముల ననుసరించి. తన అభీష్టములను నెరవేర్చుటకు యత్నిస్తున్నాడు. ఒకే వ్యక్తి ఒక ఋతువునందు పల్చని చొక్కాను, మరొక ఋతువునందు ఉలెన్ కోటును కుట్టించుకుంటున్నాడు. వీనిని ఎండాకాలమందు, చలికాలమందు ధరిస్తాడు. కానీ చలికాలమున పల్చని చొక్కాను, ఎండాకాలమున ఉలెన్ కోటును పారవేయడు. ఎవ్వరికీ ఇవ్వడు. వీని అవసరాన్ని గుర్తించి భద్రపరుచుకుంటాడు. అదే విధంగా సుఖః దుఃఖములు రెండు ఆయా కాలములందు ప్రదేశములందు, ఆయా వ్యక్తులను పురస్కరించుకుని ఒక విధమైన ఆనందమునే అందిస్తుంది కానీ కీడును కలుగ జేయదు. ఈ సత్యాన్ని గుర్తించిననాడే మనకు సమత్వం ఏర్పడుతుంది. ఇదే ప్రకృతిలోని సమత్వము. ఇది ప్రతి మానవునికి అవసరము.

ఇక రెండవది సమాజముయొక్క సమత్వము సుఖ దుఃఖములు, లాభనష్టములు, ప్రకృతిలో, సమాజములో ఆయా కాలమును, సందర్భమును పురస్కరించుకొని మానవునికి మంచినే కలుగజేస్తాయి. ఒకే వీధియందు ఒక ఇంటిలో మరణము, మరొక ఇంటిలో వివాహము జరుగుతుంటాయి. ఒక ఇంటిలో ఏడుపు, మరొక ఇంటిలో ఆనందము. ఇది సర్వ సామాన్యమైన విషయము. ఏ ఇంటిలో మరణము సంభవించినదో ఆ ఇంటివారే బాధపడతారు. కానీ, తక్కినవారు బాధ పడరు. ఏ ఇంటిలో కళ్యాణము జరుగుతుందో ఆ ఇంటివారు మాత్రమే ఆనందిస్తారు. కానీ, ఆ బజారులోని వారందరూ ఆనందించరు. సమాజములో ఒక చోట సుఖము, మరొక చోట దుఃఖము, ఒక చోట లాభము, మరొక చోట నష్టమును కలిగించు సంఘటనలు జరుగుతుంటాయి.

సమాజమనగా ఏమి? పదిమంది చేరిన గుంపు సమాజము. పదిమంది చేరి ఉన్నప్పుడు ఏదో ఒక రకమైన హెచ్చుతగ్గులు ఏర్పడతాయి. ఎందుచేత ? ఇది మానవ నైజము. సమాజ ధర్మము. దీనినే **Nature** అంటారు.

మన దేహాన్ని ఒకసారి పరిశీలించండి. ఎన్ని ఎత్తుపల్లములతో కూడియున్నదో. దేహము ఎత్తు పల్లములుగా ఉన్నప్పుడు దానిలో నున్న మనస్సు కూడ ఎత్తుపల్లములు లేకుండ ఉండకలదా? పాత్ర ఎట్టిదో పదార్థమట్టిది. అంటే పాత్ర ఎట్టి ఆకారములో నున్నదో దానిలోని పదార్థమునకు అట్టి ఆకారముంటుంది. గాలికి ఎట్టి ఆకారము లేదు. అది **Foot ball**లో నిండినప్పుడు ఆ బాల్ ఆకారమును, ఒక బెలూన్‌లో చేరినప్పుడు దాని ఆకారమును గ్రహిస్తుంది. కాబట్టి సుఖ దుఃఖములను సమచిత్తముతో స్వీకరించాలి. ఈనాడు దుఃఖముతోనున్నను రేపో.

మాపో సుఖము లభిస్తుందని అనుకోవాలి. దుఃఖము లేకపోతే సుఖము ననుభవించలేము. చీకటి లేకపోతే వెలుతురు విలువ తెలియదు. ఆకలి లేకపోతే అన్నము కూడ ఆశించము. చావు లేకపోతే తల్లికూడ బిడ్డను ప్రేమించదు. నా బిడ్డ ఏమైపోతుందో అన్న భయమే తల్లి బిడ్డను ప్రేమించేటట్లు చేస్తుంది. "న సుఖాత్ లభ్యతే సుఖం" అన్నారు. సుఖము వలన సుఖము లభించదు. కష్టము ద్వారానే సుఖము కలుగుతుంది. ఈ జగత్తంతా సంయోగ వియోగముల చేరికయే. అందరూ సుఖంగా ఉంటే సమాజంలో ఇంక ఎవరినెవరు విచారించనక్కరలేదు. ఒకరికొకరు సేవ చేయనక్కరలేదు. సమాజములో సంభవించే సుఖ దుఃఖములు, లాభనష్టములు, నిందాస్తుతులు సమత్వంతో స్వీకరించాలి. దీనినే సమాజ సమత్వమన్నారు.

మూడవది జ్ఞాన సమత్వము "ఏకం ఏవా అద్వితీయం బ్రహ్మ" "అద్వైత దర్శనం జ్ఞానం" అన్నారు. అన్నింటియందున్న ఏకత్వాన్ని గుర్తించినప్పుడు జ్ఞానసమత్వ మేర్పడుతుంది. ఏ రీతిగా ఈ సమత్వాన్ని ఊహించాలి? మన ఆకారములు, భావములు, మతములు వేరు కావచ్చు. కానీ దైవత్వములో మాత్రము ఏకత్వముంటుంది.

ఒక ఉదాహరణ : నేను ఇక్కడ మైకులో మాట్లాడుతున్నాను. అక్కడ Bulb వెలుగుతున్నది. ఇంకొక చోట Fan తిరుగుతున్నది. ఒకటి శబ్దమును మరొకటి వెలుగును, ఇంకొకటి చల్లదనమునూ అందిస్తున్నది. వీని రూపనామములు, అందించే ఫలితములు వేరు వేరుగా ఉన్నాయి. కానీ వానిలోని శక్తి Current మాత్రము ఒక్కటే. ఈ ఒక్క కరెంటు Fail అయిందంటే ఈ మూడు ఒకేసారి పని చేయడము ఆగిపోతుంది. అంతేగానీ ఏ ఒకదానిని చూచి మరొకటి ఆగిపోదు కదా! మూడు ఒకే పర్యాయము ఆగిపోతాయి. అదే విధంగా మన కన్నులలో, చెవులలో, నాలుకలో, చర్మములో, నాసికా రంధ్రములలో ఆయా కర్మలను చేయించే శక్తి ఒకటి ఉంది. అదే ప్రజ్ఞానము. ఈ ప్రజ్ఞానతత్వము మన జీవితములో వికాసమును, విజ్ఞానమును అందిస్తున్నది. దానినే "ప్రజ్ఞానం బ్రహ్మ" అన్నారు. ప్రజ్ఞానముతో సత్ అంతర్భూతమై ఉంది. దీని నే విధంగా గుర్తించాలి? దీని తత్వమేమిటి? మనం వాక్కుతో సత్యమును పలుకుతాము. ఒక సమయంలో ఎవరో మరొకరిని కొట్టడము మనం చూశాము చూశాము కదా అని కోర్టులో మనము ఫలానావాడు ఇతనిని కొట్టి చంపాడు అని చెప్తాము. ఆ కొట్టినవానికి ఉరిశిక్ష వేస్తారు. ఇక్కడ నీవు సత్యము చెప్పిన దానివలన కొట్టిచంపిన వాడు చంపబడ్డాడు. అతడు రెండు పాపములు చేశాడు. కొట్టడం ఒక పాపం చంపడం రెండవ పాపం. అతడు ఆ విధంగా అన్యాయంగా అక్రమంగా ప్రవర్తించి చంపాడు. నీవు పలికినది సత్యమే అయినను వాని మరణమునకు నీవు కారణభూతుడవవుతున్నావు. ఈ రెండింటి వ్యత్యాసమేమిటి?

సత్యం హితం ప్రియాత్.

సత్యము కూడ ప్రియంగా ఉండాలి అప్రియంగా ఉండకూడదు. సత్యమును చెప్పి ఒకరికి ప్రాణాపాయమును కలుగజేయరాదు. అట్టి పరిస్థితిలో సత్యమును గానీ, అసత్యమునుగానీ దేనినీ చెప్పకూడదు. ఇది సమాజధర్మము. కానీ ఏట్లా ఇది సాధ్యము?

ఒక చిన్న కథ : ఒక అరణ్యములో ఒక సన్యాసి తపస్సు చేసుకుంటున్నాడు. అతడు సత్యవ్రతుడు. ఎవ్వరికీ, ఎన్నడూ, ఎట్టి అన్యాయము తలపెట్టినవాడు కాదు. హాస్యమునకు కూడ అసత్య

మాడెడి వాడు కాదు. ఇతని న్యాయ తత్పరత, సత్య సంధత, జగద్విఖ్యాతి గాంచినవి. ఒక అసూయా పరుడు ఎట్లయినా ఈ మునిచేత అన్యాయమైనా చేయించాలి, అసత్యమైనా పలికించాలి అని శపథం చేశాడు. ఒకనాడు వేటగానివలె వేషము వేసుకుని ఒక మృగమును తరుముకుంటూ సన్యాసి ఉండే ప్రదేశమును చేరుకున్నాడు. ఆ మృగము సన్యాసి ముందుగా పరుగెత్తిపోయి ప్రక్కనున్న పొదలో దూరింది. వేటగాడు దీనిని గమనించి, సన్యాసి దగ్గరకు వచ్చి, "అయ్యా ఇంతకు ముందే ఒక మృగము ఇటువైపు పరుగెత్తుకుని వచ్చింది. దానిని మీరు చూశారా?" అని అడిగాడు. ఆ ముని యోచించాడు. "నేను చూడలేదు అంటే అసత్యమవుతుంది. చూశాను అంటే పొదలో ఉన్న మృగము నితడు చంపుతాడు." ఏం చేయాలి? ఒకటి అసత్యము, ఇంకొకటి అన్యాయము. అందుకని ఒక యుక్తిని పన్నాడు. "నాయనా! ఏది చూచెనో అది పలుకలేదు. ఏది పలుకునో అది చూడలేదు." అన్నాడట. అంటే ఏమిటి? కన్నులు చూశాయి. కానీ అవి చెప్పలేవు. నోరు పలుకుతుంది - కానీ అది చూడలేదు. కనుక మనము కూడ అప్పుడప్పుడు కొంత యుక్తి మార్గము నవలంబించాలి. ఎటువంటి యుక్తి? ఇతరులకు హాని కలుగని యుక్తి. "నొప్పింపక తా నొవ్వక" అనే విధముగ అన్ని జీవులయందు ఉండేది ఒకే దివ్యత్వమని గుర్తించి వర్తించాలి. దీనినే Bibleలో All Life is one My dear Son; be alike to every one అన్నారు. దీనినే "ఈశావాస్య మిదం సర్వం" అని ఉపనిషత్తు అంటుంది. దీనినే మరొక విధంగా "ఏకం సత్ విప్రాః బహుధా వదంతి" అన్నారు. ఈ విధముగా అనాది కాలమునుండి మహనీయులు, ఈ ఏకత్వమైన దివ్యత్వమును గురించి ప్రమాణపూర్వకంగా నిరూపిస్తూ వచ్చారు. ఈ సమత్వమనే జ్ఞానము ఎట్లేర్పడుతుంది? దైవత్వము లేని పదార్థము ఏదీ లేదు. దీనికి కొన్ని ఉదాహరణలు తీసుకుందాం. ఎక్కడయినా ఒక వివాహమో, ఉత్సవమో జరుపుకుంటున్నప్పుడు అనేక రకములయిన రంగురంగుల బల్బులను పెడతాము. అనేక రంగుల వెలుగును అవి అందిస్తాయి. Bulb రంగు ఏదో, వెలుగు రంగుకూడ అట్లే ఉంటుంది. ఈ బల్బులలో వాని Power వేరు వేరుగా ఉండవచ్చు. కానీ ప్రవహించే కరెంటు ఒక్కటే. రూపనామములు వేరు. అందులో శక్తి ఒక్కటే. ఇక్కడ నా ముందర ఎంతో మంది కూర్చొని ఉన్నారు. మీ రూపనామములు వేరు. కానీ మీలో ఉన్న చిత్ శక్తి, ప్రజ్ఞాన శక్తి ఒక్కటే. కానీ ఒకరియందు పెద్దదిగా, మరొకరియందు చిన్నదిగా ఉంది. (బల్బుల పవర్‌ని బట్టి ఒకే కరెంటు ప్రవహిస్తున్నా, వెలుగులో భేదమున్నట్లున్నది) అది మనము సాధన ద్వారా అందుకున్న ఫలితముల మీద ఆధారపడి ఉంటుంది. మనము BedRoomలో ఒక చిన్న Bulb పెట్టుకుంటాము. Drawing Roomలో ఎక్కువ Power ఉన్నది పెడ్తాము. ఒకటి Dimగా వెలుగుతుంది. రెండవది చాలా Bright గ ఉంటుంది. కానీ ఈ రెండింటిలోని Current ఒకటే. ఈ Powerను మనము కర్మ పరిపాకము అనివచ్చు. మనము ఎటువంటి కర్మలు ఆచరించామో దానిని బట్టి మన హృదయమనే Bulbలో ఒక రకమైన శక్తి చేరుతుంది. ఆ శక్తిని ఎవరూ మార్చలేరు, కప్పిపుచ్చలేరు. అందువలననే చిత్రవాసి చిత్రగుప్తుని కనులెట్లు కప్పుదునని అంటారు. నీవేమో అందరి కనులు మూసి ఏవేవో కర్మలు చేసుకొని పోతున్నా. ఆ భగవంతుని కన్నులు ఏ రీతిగా మూయగలవు? ఆ చిత్రగుప్తుని కనులు మూయగలవా? అని సామెతగా అంటూ ఉంటారు. చిత్ర(త్ర)గుప్తుడు ఎవరు? యమ ధర్మరాజు Private Secretary కాదు. చిత్రగుప్తుడు

అంటే మనము చేసిన పన్ని మన చిత్తముతో గుప్తముగా నుంచే వాడు. మనము మరచిపోవచ్చును గానీ, చిత్రగుప్తుడు మరువడు. చిత్తములో గుప్తముగా హత్తుకుని పోయిన దానినే చిత్రగుప్తుడు అన్నారు.

మనము అన్నింటియందు ఉన్న ఏకత్వాన్ని చక్కగా విచారిస్తూ రావాలి. ఉన్నది ఒక్కటె "ఏకోహం బహు స్యామ్" అన్నారు. గీతలో "బీజం మాం సర్వ భూతానాం" అని చెప్పబడినది. ఒక వృక్షమునకు వ్రేళ్ళు, కొమ్మలు, రెమ్మలు, పుష్పములు, ఫలములు ఎన్నో కలవు. వాని రూప నామములు కూడ భిన్నముగా నున్నవి. కానీ ఇవన్నీ ఎక్కడనుంచి వచ్చినవి? ఒక చిన్న విత్తనమునుండి. అట్లే ఈ ప్రపంచము ఒక మహావృక్షము వంటిది. ఈ వృక్షమునకు ఎన్నో తెగలు అనే కొమ్మలు, రెమ్మలేర్పడినవి. ఈ తెగలనే కొమ్మలనుండి జాతులు అనే ఆకులుద్భవించినవి. ఈ జాతులలోని భావము అనే అనేక పుష్పము లేర్పడినవి. ఇవన్నీ ఒకే ఒక విత్తనమునుండి వచ్చినవి. దీని నాధారముగ చేసుకొని మనము జ్ఞాన సమత్వమనే దానిని అర్థము చేసుకుని ఆనందం చేకూర్చుకోవాలి. ఈ ఆనందం ఎట్లా కలుగుతుంది? సుఖ దుఃఖములలో అన్నింటిలో ఒకే సమచిత్తము కలిగియుండటమే. అందరి యందున్న ఒకే ఆత్మతత్వాన్ని గుర్తించి, వర్తించితే జ్ఞాన సమత్వ మేర్పడుతుంది.

ఇక కర్మ సమత్వము :- ఈ ప్రకృతి ఒక కర్మక్షేత్రము. ఇందులో అందరూ కర్మాచరణ కర్తలు. ఏవరూ కర్మ ఫలదాతలు కారు. అందరికీ ఒకే ఒక ఫలప్రదాత ఉన్నాడు. కర్మలు ఎన్నో ఉన్నా, కర్తలు ఎందరో ఉన్నా కర్మ ఫలప్రదాత ఒక్కడే. ఒక చిన్న ఉదాహరణ.

ఒక పల్లెలో ఏదో ఒక నాటకము వేస్తున్నారు. ఆ **Stage** మీద ఇటువైపు అటువైపు, **Petromax Lights** పెట్టారు. లేదా **Current Light** అయినా ఉంటుంది. ఆ నాటకములో ఒక సీను రాజదర్బారు. రాజు చక్కగ ఒక సింహాసనము మీద కూర్చున్నాడు. ఆ సభలో ఎంతోమంది ఆసీనులై ఉన్నారు. ఈ విధంగా దర్బారుసీను చక్కగా అమర్చినారు. దీనికి ఆ **Lights** సాక్షిగా ఉన్నాయి. ఇంకొక సీనులో ఇదే రాజు కొన్ని పరిస్థితుల ప్రభావముల వలన తన రాజ్యసర్వస్వమును కోల్పోయి బికారిగా అరణ్యములో ఉన్నట్లు నటిస్తాడు. దీనికి కూడ అదే **Lights** సాక్షిగా ఉన్నాయి. మరొక సీనులో అదే రాజు స్మశానములో కాటికాపరిగ కనపడతాడు. ఈ సీనులో కూడ సాక్షి భూతములుగా నిల్చి ఆ **Lights** వెలుగుతున్నాయి. రాజుయొక్క జీవితగమనము, అతడు చేసే పనులు మారినవి. కానీ ఈ **Lights** మారలేదు. ఇవే కర్మదాతలు. మనము. మనము చేయుపనులు మారుతున్నవే కానీ, మనలోనున్న ఆత్మ మాత్రము సాక్షీభూతముగ ఒకే విధంగా ఉంటుంది. దానికెట్టి మార్పు, మాలిన్యము చేరదు.

ఇంకొక ఉదాహరణ :- మనము ఒక రోడ్డుమీద నడుస్తున్నాము. ఒక వైపు కాలువ ఉంది, మరొక వైపు పెంటకుప్ప ఉంది. మనము తారు రోడ్డు మీద నడుస్తున్నాము. మన నీడ ఈ **side** కాలువలోని నీటిలో, ఆ పెంటకుప్పపై, ఈ తారు రోడ్డుమీద పడింది. కానీ వాటి మాలిన్యమేమయినా మనకు అంటినదా? లేదు. ఆ నీడ నీదే. కానీ నీ నీడ మాలిన్యమైనదే కానీ, నీవు కాదు కదా! ఇదే ఆత్మ సాక్షీభూతముగా ఉంది అంటే. నీవు అదే, కానీ అది నీవు కాదు. నీవు జగత్తులో ఉండు, కానీ జగత్తును నీలో చేర్చకు. ఈ విషయముపై కొంత చర్చ జరుపుతాము. నీవు - అదే; అది నీవు కాదు, ఇది ఎట్లా సాధ్యము? ఒక చిన్న ఉదాహరణ :- నీవు ఒక నీళ్ళ తొట్టిముందు కూర్చొని నీ ప్రతిబింబాన్ని చూస్తున్నావు. ఎవరో

వెనుకనుండి నీ ప్రతిబింబాన్ని కర్రతో కొట్టారు. ఆ దెబ్బ నీకు తగిలిందా? లేదు. ఆ ప్రతిబింబము నీదే. కానీ నీవు ఆ ప్రతిబింబము కానీ, ఆ ప్రతిబింబము నీవు కానీ కాదు. ఆ ప్రతిబింబములో నీ ఆకారము ఉంది. కానీ ప్రాణము లేదు. కానీ బింబ ప్రతిబింబము లలో ఈ రెండింటి యందు భిన్న ప్రమాణములలో ఆత్మ తత్వముంటుంది. ఎట్లా? ప్రతి పదార్థములోను అణువులుంటాయి. ఈ అణువులలో అనేక రకము లైన శక్తులు: Neutrons, Protons, Electronsగా ఉన్నాయి. ఇవి అన్నింటిలోను ఉన్నాయి, ఇవిలేని ఏ పదార్థము ఉండదు. ఇవి అన్నింటిలోనూ చేరి ఉంటుంది, అన్నింటిలోనూ ఉన్న ఈ దివ్యశక్తినే ఆత్మతత్వమని అంటాము. దీనినే "వేదాహ వేదం పురుషం మహాంతం। ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్" ఈ తత్వము ఒక పురుషత్వమను రూపము దాల్చు తుంది. అయితే ఈ పురుషత్వమునకు అర్థము చైతన్య వంతమైన స్వరూపమని గ్రహింపవలెను. మరి పురు షోత్తముడనగా అర్థమేమి? దీనికి ఒక ఉదాహరణ : ఒకచోట ఒకటి లేక రెండు కొబ్బరి చెట్లుండవచ్చు. కొన్ని వందలు చెట్లు ఒకేచోట ఉన్నప్పుడు అది వన ముగా మారుతుంది. చెట్టును వనము అనము. వన మును చెట్టు అనము. ఒక ఊరిలో చాలా ఇళ్ళుం టాయి. ఒకే ఇల్లుంటే అది ఊరు అవుతుందా? కానీ ఊరిని ఇల్లు అంటామా? అదే విధంగా ఈ పురు షత్వాన్ని, పురుషోత్తమ తత్వాన్ని అర్థం చేసు కోవాలి. అనేక ఉపాధులందు చేరియున్న చైతన్య తత్వాన్ని చిత్‌శక్తి అని ఆత్మతత్వమని అంటాము. ఒకటి సమిష్టి స్వరూపము అంటాము. ఒకటి వ్యష్టి స్వరూపము. మరొకటి సమిష్టి స్వరూపము. దీనినే నారదభక్తి సూత్రములో

ఇచ్ఛారామో భవతి ఆత్మారామో భవతి
తక్తో భవతి ముక్తో భవతి –

అని అనేక రకములుగా వారివారి భావావేశమునకు అనుగుణ్యంగా వర్ణిస్తూ వచ్చారు. స్వరూపములు భిన్న ములు కానీ అందులో ఉన్న తత్వము ఒక్కటే ఉదా హరణకి ఒక్కొక్కసారి ఏదయినా తిరునాళ్ళకు వెళ్ళినపుడు అక్కడ చక్కెరతో అనేక రకములైన ఆకారముతో అనగా చిలుక, ఏనుగు, పులి, కుక్క, పిల్లి లాగ చేసి అమ్ముతారు వీటిలో ఉన్నది ఒక్క చక్కెరే. కానీ దానిని పిల్లలు తిన్నప్పుడు నేను ఏనుగు తిన్నాను. నేను జింకను తిన్నాను. అని వాని రూపములనే అనుకుంటూ తింటారు. వీని ధర ఒక్క టిగా ఉంటుంది – రెండు నయాపైసలే. ఈ తత్వాన్ని మనము గ్రహించాలి. కర్మలు, కర్మాచరణలు వేరు వేరు. కానీ వానిలో చేరియున్న దైవత్వము ఒక్కటే. దీనినే కర్మ సమత్వము.

ఇక భక్తి సమత్వము : "త్వమేవ సర్వం మమ దేవ దేవా!" భక్తి తత్వమేమిటి? ఓ దేవా! అందరి యందున్నది నీవే. సర్వులచే ఆరాధింపబడే వాడవు నీవే అన్నదే. అందరి యందున్న ప్రేమతత్వాన్ని మనము దివ్యత్వముగా గుర్తించాలి. ఇదే భక్తి, ఏకత్వముగా నున్న ఈ దివ్య ప్రేమతత్వము సర్వ వ్యాపకమైయున్నపుడు కనిపించదు. అవతారముగా వచ్చినప్పుడే కనుపించును. ఉదా॥ ఒక దినమున ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతునికి బోధించే సమయమున "నాయనా! భగవంతుడెక్కడ ఉన్నాడు? అని అడిగాడు. శ్వేతకేతు "సర్వత్ర ఉంటున్నాడని మా గురువుగారు చెప్పారు. అందువలన నాకు తెలుసు" అని అన్నాడు. శ్వేతకేతు అనుభవపూర్వకముగ అందుకొనలేకపోవుట వలన తండ్రికి చక్కగా సమా ధానము చెప్పలేకపోయాడు. అప్పుడు ఉద్దాలకుడు తన కుమారునికి ఈ అనుభూతిని కలిదించే నిమిత్తమై "నాయనా! లోపలికి వెళ్ళి కొంత చక్కెర తీసు కొనిరా" అన్నాడు. శ్వేతకేతు అట్లే చేశాడు. ఉద్దాల

కుడు ఆ చక్కెరను చేతిలోనికి తీసుకొని ఇది "చక్కెరే కదా" అన్నాడు. శ్వేతకేతు "అవును" అన్నాడు. ఉద్దాలకుడు "కొంచెము నీరు తీసుకురా!" అన్నాడు. శ్వేతకేతు అట్లే చేశాడు. అపుడు ఉద్దాలకుడు "ఈ చక్కెరను ఆ పాత్రలోని నీటిలో వేసి బాగా కలుపు" అన్నాడు. శ్వేతకేతు అట్లే చేశాడు. అప్పుడు ఉద్దాలకుడు "నాయనా! మనమిందులో వేసిన చక్కెర ఎక్కడ ఉంది?" అని అడిగాడు. శ్వేతకేతు పాత్రలో అడుగు భాగమున, ప్రక్కన, పైన అంతా చూశాడు. లేదు. చేతికి చక్కెర చిక్కలేదు. కానీ చేతికి చిక్కని చక్కెర అందులో ఉండాలి కదా! మరి దానిని తెలుసుకోడానికి ఏమి చేయాలి? ఉద్దాలకుడు "నాయనా! ఒక చుక్క ఆ నీటిని నాలుక మీద వేసుకొనుమని" అన్నాడు. శ్వేతకేతు అట్లే చేశాడు. ఉద్దాలకుడు "ఎట్లా ఉంది?" అన్నాడు. శ్వేతకేతు "తియ్యగా ఉంది" అన్నాడు ఉద్దాలకుడు. "ఎట్లా తెలిసింది?" అన్నాడు. వెంటనే శ్వేతకేతు "అనుభవించాను కాబట్టి" అన్నాడు. ఆ నీటిలో చక్కెర చూచుటకు కానీ, చేతితో పట్టుకొనుటకు కానీ వీలుకాక పోయిననూ, అంతటా లీనమైపోయింది అన్న విషయం అనుభవపూర్వకముగా తెలుసుకున్నాడు. ఇట్లే ఆత్మతత్వమును కూడ అనుభవపూర్వకముగా తెలుసుకోవాలి. అయితే ఈ ఆత్మానందమును పొందుటకై మనమువేదేదో చేస్తున్నాము.

పుట్టపై మర్దించినా పాము మరణించునా
తనువును తాను దండించిన విషయభోగము
మానునా
ఆకలి దప్పులు మానిన ఆత్మ జ్ఞాని తానగునా
తానెవరో తెలియకున్న తత్వజ్ఞుడు తానెట్లగును?

కాబట్టి మనము **Practical**గ ఈ తత్వమును కనుక్కోవాలి. ప్రశ్నోత్తరములతో లభించెడిది కాదు. విషయము మాత్రము తెలుసుకొనవచ్చును. విషయ స్వరూపమును అనుభవించుటకు అనుభవము కావాలి. ఎవరు ఏది చేస్తే మంచిదో దానిని మొదట మనము చేసిచూపాలి. ఎవరు ఏది చేస్తే తప్పో, దానిని మనము చేయకూడదు. ఇదే నేడు మనము చేయవలసినది.

ఈ అభ్యుదయ పాఠశాలలో ఈ విధంగా నడచుకోవాలి. ఒకరిని చేయవద్దు అనే దానిని ముందు మనము చేయకూడదు. ఇతరులు మనలను ఏ విధంగా గౌరవిస్తే ఆనందిస్తామో, అట్టి గౌరవమును మనము వారికి అందివ్వాలి. ఎందులకు? మనము ఏది చేసినా దానికి **Reaction, Reflection, Resound** ఉంటుంది. నన్ను మాత్రం అందరు గౌరవించాలి. నేను మాత్రం చేయను. అంటే ఎట్లా సాధ్యపడుతుంది? ఒక సామెత ఉంది : "తీసుకోమ్మా ఉప్పు అంటే - పట్టమ్మా పప్పు అంటారు". ఎలాంటి పనో అలాంటి ఫలితము. కాబట్టి మనము జగత్తులో మంచినే చేసి, మంచినే అందుకోవాలి. మంచిని చేయకుండా మంచిని అందుకోవాలని అనుకోవడం ఒక రకమైన అమాయకత్వము.

చెడ్డపని చేసి మంచిని చెందబోరు.
మంచిపని చేసి కీడును గాంచలేరు.

అప్పుడప్పుడు మీరు అనవచ్చు - స్వామీ! మేము మంచి పని చేసినా మాకు చెడే జరిగింది అని. కానీ మీ పని మంచిది కావచ్చు. కానీ మీ భావములలో దోషముండవచ్చు. లేకపోతే చెడు రావడానికి వీలు లేదు. స్వార్థము లేకుండ, ఇది మంచి - ఇది చెడు అనుకోకుండ సర్వకర్మలు భగవత్ప్రీత్యర్థముగ చేస్తే- దానివలన మీకు ఎటువంటి నొప్పి, బాధ, నష్టము కలుగదు. అన్నింటికి కారణము మన దోషములు. మన దోషములు మనకు కానరావు. ఎట్లు?

తప్పు కానక సర్వము ఒప్పుగా భావించి
ప్రకటించు చుందురు ప్రాజ్ఞ జనులు.
తప్పును తప్పుగా ఒప్పును ఒప్పుగా జూచి
శ్లాఘించు చుందురు సరస జనులు
ఒప్పులను మరచి తప్పులనే గ్రైకొని
కలహించు చుందురు కలుష జనులు
ఒప్పులన్నియు తప్పులుగా చేసి
దూషించు చుందురు దుష్ట జనులు.
మొదటి మూడింట ఒక విధమైన రీతి కలదు
నాల్గవ పక్షమందున్న వారిని నరుల నరయ
వారి కంటే రాక్షసుండే మేలు.

మంచిని చెడ్డగా తీసికొనడము, ఇది దానవత్వానికి కారణము. మానవత్వము మంచిని మంచిగా, చెడ్డను చెడ్డగా తీసుకుంటుంది. చెడ్డలో కూడ మంచినే తీసుకునేవారు ఉత్తములు. ఉదా॥ చీకటి, చీకటి అంటున్నాము. చీకటిలో కూడ ఒక విధమైన వెలుతురు ఉంది.

పగటి వేళల చుక్కలు కనపడని భంగి
శ్రీ కరుండైన పరమాత్మ నీకు నరుడా,
కానరానంత మాత్రాన –
అతడు లేడని అనగలమా ?

పగలు కూడ ఆకాశములో నక్షత్రములున్నవి. కానీ అవి కనపించవు. ఎందుచేత? వెలుగు ఎక్కువగా ఉండటము చేత దానిని చీకటి ఆవరించినది కానీ రాత్రి పూట మనకు చీకటి ఏర్పడటం చేత ఈ చుక్కలను చూస్తున్నాము, కాబట్టి చీకటితో వెలుతురు, వెలుతురులో చీకటి ఉంటుంది. ఇది Scientific Truth. వెలుతురు, చీకటి ఒకదానికొకటి సంబంధము లేకుండ ఉండలేదు. కానీ మనము చీకటిని, వెలుతురును వేరుగా భావిస్తాము. ఇది ఒక భ్రమ. నేను ఇదివరకే ఒకసారి చెప్పాను. మన నోటిలోనికి పోయే అనేక వేల మెతుకులను లెక్కపెట్టము. కానీ రెండు రాళ్ళు పంటిక్రింద చేరెనా ఆడవాళ్ళను కోప్పడుతాము. మంచిని మరుస్తాము. చెడ్డనే చూపుతాము, అదే విధముగ మనలో జ్ఞానమనే వెలుతురు, అజ్ఞానమనే చీకటి, రెండు ఉన్నాయి. ఈ విధముగ ప్రపంచములో అంతా రెండు, రెండుగానే ఉంటుంది. కష్టసుఖములు, చీకటి వెలుగులు' ఇది ప్రపచం స్వభావము, ఒకటి లేక మరొకటి ఉండదు. కష్టములో సుఖము, సుఖములో కష్టము ఉంటుంది. ఇంతేకాక ఒకే సంఘటన ఒకరికి మంచి చేయవచ్చును. మరొకరికి ఏమీ చేయకపోవచ్చును ఉదా॥ సూర్యోదయమున కమలము వికసించును. సూర్యాస్తమయమున కలువ వికసించును. సూర్యోదయము కాగానే మనకు సంతోషము, రాత్రి కాగానే దొంగలకు సంతోషము, ఈ విధంగా సూర్యోదయము కొందరికి సంతోషము నందిస్తే సూర్యాస్తమయము మరి కొందరికి సంతోషము నందిస్తున్నది. కాలమునందు దోషము లేదు. కర్మలందున్నది. కాబట్టి మనము చేయవలసినది మనకు నిర్ణయింపబడిన కర్మలను, నిందాస్తుతులకు, దూషణ, భూషణలకు ఏ మాత్రము చలించకూడదు. ఒకసారి దూషణ కూడ మంచిని అందించవచ్చును. అది నీ అహంకారమును దూరము చేయవచ్చును. భూషణ వలన నీ అహంకారము పెరుగవచ్చును. కాబట్టి రెండు అవసరమే. రెండింటియందు సమత్వమును చూపాలి. ఇట్లు పొంగక, క్రుంగక ఉన్నటువంటి తత్వమే ఆత్మతత్వము.

ఒకసారి బుద్ధభగవాన్ తన శిష్యులతో కూడి ఉన్న సమయమున అక్కడకు ఒకతను వచ్చి, వారిని అనేక రకములుగా దూషించడం మొదలు పెట్టాడు, శిష్యులకు కోపము, బాధ కలిగాయి. కానీ బుద్ధుడు చిరునవ్వు చిందిస్తూ కూర్చుని వింటున్నాడు.

ఆ తిట్టినవాడు ఇంక ఏమీ చేయలేక నిల్చున్నాడు. అప్పుడు బుద్ధుడు "నాయనా! నీవు తిట్టడం అంతా అయిపోయిందా? నేనింక లోపలకు వెళ్ళాలి" అన్నాడు. అప్పుడతడు తన తప్పును తెలుసుకుని బుద్ధుని కాళ్ళమీద పడి "స్వామీ! ఇంత శాంతముగా ఇంత సమత్వంతో ఉండుటచేతనే మీరు మహాత్ములైనారు. నావంటి వారు తుచ్ఛులైనారు" అన్నాడు. అప్పుడు బుద్ధుడు "నాయనా! మన ఇంటికి ఎవరయినా వస్తున్నప్పుడు పెట్టె బెడ్డింగుతో నీవు చూచిన వెంటనే "ఏమండీ! బావగారు, ఎప్పుడు వచ్చారు, రండి" అని ఆదరంగా పిలిస్తేనే వారు ఇంటిలోనికి వస్తారు. వారిని చూడగానే పలుకరించకుండా, లోపలికి వెళ్ళిపోతే అతను హోటలుకు వెళ్ళిపోతాడు. ఎవరయినా తిడుతున్నప్పుడు నేనుకూడ పరుషంగా మాట్లాడితే వాడు ఇంకా ముందుకు వస్తాడు. "ఏమండీ ఎప్పుడు వచ్చారు! అంటే చాలు ఇంట్లోకి వచ్చేస్తారు. నీవు ఏమీ మాట్లాడకుంటే వెళ్ళిపోతారు" అన్నాడు. రిజిష్టరు పోస్టులో వచ్చిన ఉత్తరమును మనము సంతకము చేస్తేనే మనకిస్తారు. లేకపోతే అది తిరిగి వెళ్ళిపోతుంది. (Redirect చేస్తారు కనుక) అట్లు కాక నన్నే అంటున్నారే అని బాధపడి, దానిని Acknowledge (Signature చేసి) చేస్తే అది నీ దగ్గరకు చేరుతుంది అది నన్ను కాదు. అన్న భావముతో నుంటివా అది తెచ్చిన వాని వద్దే ఉంటుంది. ఇట్టి సమత్వాన్ని మనం సాధించాలి. ఇది ప్రపంచానికీ, మనకీ, ఎంతో అవసరము. ప్రజ్ఞాశక్తిని ఒక్కొక్కరు ఒక్కొక్క మార్గమున ప్రవేశపెడతారు అన్నింటి కోసూ, దీనిని అధ్యాత్మికంగా ప్రవేశపెడతే అన్ని రంగముల యందు రాణిస్తుంది, ఇప్పటికే కాలాతీతమయినందున ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

## మహాశివరాత్రి గురించి ప్రకటన

1976వ సంవత్సరమున, మహాశివరాత్రి ఉత్సవము కొరకు ప్రశాంతినిలయము నందు లక్షలాది భక్తులు సమావేశమైన సందర్భములో జనరద్దీ వలన భక్తులకు కలిగే భోజన వసతి తదితర అసౌకర్యముల దృష్ట్యా ఇకముందు మహాశివరాత్రి ఉత్సవములు ప్రశాంతి నిలయమునందు జరుగవని భగవాన్ ప్రకటించారు.

ఆ ప్రకటన ననుసరించి ఈ యేడుకూడా శివరాత్రి ఉత్సవం ప్రశాంతి నిలయంలో జరుగదు. పాఠకులు ఇది గ్రహించి ప్రశాంతి నిలయం రాదల్చుకున్న భక్తులకీ విషయం తేలియజేయగోరుచున్నాము.

# సత్సంగత్వే నిస్సంగత్వం

మంచికాలము, పదవులు, మంచిబ్రతుకు
కోరుచుందురు మనుజులు కోరకోరు
మంచి బుద్ధులు, జ్ఞానంబు, మంచినడత
ఇంతకన్నను వేరేద్ది ఎఱుకపరుతు
సాధుసద్గుణ గణ్యులౌ సభ్యులారా!

ప్రేమ స్వరూపులారా!

ప్రపంచములో జీవితమునకు ఆనందదాయకమొనరించు పదార్థము ఒక్కటి మాత్రమే. అదియే ఆరోగ్యము. ఆరోగ్యమే మహాభాగ్యము. ఇట్టి మహాభాగ్యమే మానవుని యొక్క పరమ గమ్యము. ఆనందమయమైన ఆత్మ సందర్శన నిమిత్తమై, ఆరోగ్యమయమైన దేహము అత్యావసరమను సత్యమును మనము గుర్తించవలెను. హృదయము ఆనందమయము దేహము ఆరోగ్యమయము. ఈ ఆనంద, ఆరోగ్యమయ

ముల యొక్క సమ్మిళితమైన స్వరూపమే దివ్యానందము యొక్క తత్త్వము.

ఈనాడు మానవునకు కాయికమైన ఆరోగ్యము, మానసిక ఆరోగ్యము లేకపోవుట చేతనే, ఆనందమునకు అతి దూరముగా జీవించుచున్నాడు. 'ధర్మ,అర్థ, కామ, మోక్షానాం ఆరోగ్యం మూలముత్తమమ్' అనగా ఈ చతుర్విధములైన పురుషార్థములకును ఆరోగ్యమే ఒక పునాది వంటిదని మనము గుర్తించవలెను. ఆరోగ్యము లేకున్న మానవుడు అల్పకార్యమునందుకూడను తనయొక్క శక్తి సామర్థ్యములను వినియోగించుకొనలేకపోతున్నాడు. కనుక మానవునకు ఆనందము అత్యవసరమనియు, ఆనందనిమిత్తమై మనము అనేక విధములైన మార్గములు అవలంబించవలెననియు ఈనాడు గుర్తించుట అత్యవసరము. ప్రకృతి యొక్క ధర్మములను మనము పరివర్తించినపుడే ఆరోగ్యమునకు కొంతవరకు మార్గము ఏర్పడుతుంది. ప్రకృతి సాధనల యొక్క మార్గములను మనము దుర్వినియోగ పరచుటచేత మన ఆరోగ్యము కూడను క్షీణించిపోవును. ఆరోగ్యమునకు ఆహారముకూడను అత్యవసరము. ఈ ఆహారమును మితముగను, పరిశుద్ధముగను సాత్త్వికమైనటువంటివిగను ఉండినప్పుడే ఆరోగ్యము యేమాత్రము కూడను క్షీణించకుండ ఉండుటకు అవకాశము ఉండును.

మానవుని యొక్క ఆశలు మితిమీరి పోవుటచేత ఆరోగ్యము క్షీణించి, ఆనందము కూడను నశించి కేవలము రోగిష్ఠుడుగా జీవితమును అంతము కావించుకొనుచున్నాడు. మనయొక్క పరిసర ప్రాంతములు కాని, లేక నివసించేటటువంటి ప్రదేశములు కాని, ప్రప్రథమమున పరిశుద్ధపరచుకొనుటకు ప్రయత్నము సలుపవలెను. ఆరోగ్యమును అలక్ష్యము చేయుటచేత మనకు ఆనందము కూడను అతి దూరమవుతుంది. కనుకనే మనము చతుర్విధములైన పురుషార్థములను సాధించుటకు, ఆరోగ్యమే అతి ప్రధానమను సత్యమును గుర్తించి, తద్వారా ఆరోగ్యమును పోషించుకొని ఆనందమునకు తగిన కృషి సలుపుట అవసరం.

అనేకమంది ఆధ్యాత్మిక మార్గములో ప్రవేశించి ఆరోగ్యమును లెక్కచేయక ఉపవాసములనియు, అనేక రకములైన దీక్షలు బూని తమ ఆరోగ్యమును క్షీణింప చేసుకొనుచున్నారు. మితాహారము మంచిదే గాని, అమితమైన మితాహారము కూడను కొంత క్షీణమును, కొంత బాధను కూడను కలిగించుతుంది. ఆధ్యాత్మిక మార్గమునకు ఆరోగ్యము అత్యవసరమను సత్యమును భక్తులు గుర్తించవలెను. ఉపవాసములనియు, ఇంక అనేక రకములయిన వ్రతములనియు వారు పూని, క్రమక్రమేణా తమయొక్క పుష్టికరమైన ఆరోగ్యమును క్షీణింప చేసుకొనుచున్నారు. ఉపవాసమంటే ఏమిటో దానియొక్క అంతరార్థమును వారు గుర్తించుకొనలేకపోవుచున్నారు. ఉపవాసమనగా కేవలము ఆహారమును మితముగా భుజించినంత మాత్రమున ఉపవాసము కాదు. భగవంతుని సమీపమున నివసింప జేసుకొను భావములను పెంపొందింప చేసుకొనుటయే ఉపవాసమునకు సరియైన అర్థము. ఉప అనగా సమీపము, వాసము అనగా నివాసము. భగవంతునికి సమీపములో నివాసము చేసుకొనేటటువంటి యొక్క, నివాసమునకు యోగ్యమైనటువంటి భావములను మనము అభివృద్ధి కావించుకోవటమే ఉపవాసము యొక్క అంతరార్థము.

ఇక్కడ ఆహారము అనగా కేవలము మనము భుజించేటటువంటి ఆహారము మాత్రమేకాదు, మన దృష్టి కూడను ఆహారమే. మన శ్రవణము కూడను ఆహారమే. మన స్పర్శ కూడను ఆహారమే. మన మాట కూడ ఆహారమే. ఈ విధమైనటువంటి పంచభూతములయందు, పంచేంద్రియములతో మనము

అనుభవించేటటువంటి పంచతత్త్వములు కూడను పవిత్రమైనటువంటివిగా ఉండినప్పుడే అది సాత్త్వికాహారమని చెప్పబడుతుంది. ఈ పంచేంద్రియములద్వారా పవిత్రమైన సాత్త్వికాహారమును మనము అందుకొన్న, లేక పోయినప్పుడు కామ, క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యములను అరిషడ్వర్గములనే అనారోగ్య దూతలు మనలో ప్రవేశించుదురు. క్రోధము కూడను అనారోగ్యమునకు ఒక మూలకారణము. అసూయ, అనారోగ్యమునకు ఒక ప్రధాన కారణము. అహంకారము అన్నింటికంటే అనారోగ్యము కలిగించుటకు ముఖ్యమైన కారణము. ఈ గుణముల ద్వారానే పవిత్రమైన ఆత్మ సందర్శనమునకు అవకాశమును అందించు దేహతత్త్వమును క్షీణింపజేయును.

దీనినే అనేక పర్యాయములు చెప్పినాను. భూతము ప్రేతము, పిశాచము అని అంటూ ఉంటాము. మానవునికి భూతము ఒకటి, ప్రేతము ఒకటి, పిశాచము ఒకటి, కాని ఈనాటి కలియుగమునందు ప్రతి మానవుని యందు కూడను భూత, ప్రేత, పిశాచములు మూడు కూడను ఆవరించి ఉంటున్నవి. మనయొక్క కామమే పెద్ద భూతము, అహంకారమే ఒక పెద్ద ప్రేతము, అసూయనే ఇందులో ఉన్న పిశాచము. ఈమూడులేని మానవుడు కనిపించుట చాలా అరుదుగా ఉంటున్నది. కనుక ఈభూత, ప్రేత, పిశాచములతో ఆవరించిన మానవునికి ఆనందప్రాప్తి ఏ రీతిగా లభింస్తుంది ? ఇంతియేగాక మానవునికి అనేక రకములైన ప్రాకృత సంబంధమైన చింతలు ఆవరించి, తనను అనేక విధములుగ పీడిస్తూ ఉండును. అనేక రోగములను, శత్రువులను తాను వశము చేసికొని మానవత్వమునైన దండెత్తివచ్చును, మృత్యువు అనుశత్రువు. ఇట్టి సమయమునందు తన మానవత్వమును గుర్తించుటకు సద్గుణములను, సదాచారములను, సత్ప్రవర్తనను కొంత అభివృద్ధి కావించుకొనుటకు ప్రయత్నము చేయాలి

మానవునికి ఒక రకమైన చింతకాదు.

1. పుట్టుట ఒక చింత, భూమినుండుట చింత
   సంసారమొక చింత, చావు చింత
   బాల్యమంతయు చింత, వార్ధక్యమొక చింత
   జీవించుటొక చింత, చెడువు చింత
   కర్మలన్నియు చింత, కష్టముల్ ఒక చింత
   సంతసమొక చింత, వింత చింత
   సర్వ చింతల బాప సర్వేశ్వరుని భక్తి
   కొనుడు ఇకనైన ప్రజలారా కోర్కెమీర
   ఇంతకన్నను వేరెద్ది ఎరుక పరుతు
   సాధు సద్గుణ గణ్యులౌ సభ్యులారా.

2. ధన ధాన్యముల్ కలిగి ధర్మగుణంబు ఉన్న
   సంతతి లేదనే చింత యుండు
   విద్యాధికారియై విఖ్యాతిగును యున్న
   ఉద్యోగములు లేక వెతలు చెందు
   కూటికి లేకను అల్లాడుచున్నట్టి
   నిరుపేదకు ఎందరో బిడ్డలుందురు.

ఈ విధముగా మానవత్వమనేటటువంటిది అనేక రకములైన చిక్కులతో, చింతలతో, చికాకులతో తాను జీవించుతూ వచ్చుచున్నది. కనుక మానవుడు మానసిక శాంతి కోల్పోవటము చేతనే దేహ అనారోగ్యము కూడను ప్రబలమగుచున్నది. కనుక ప్రప్రథమములో మానసిక శాంతిని సంపాదించుకొనే కొరకు ప్రతి మానవుడు కూడను ప్రయత్నించవలెను. దేహ విశ్రాంతి మందిరములను అభివృద్ధి పరచుకొనుచున్నామే కాని మానసిక విశ్రాంతి మందిరములకు ఏమాత్రము కూడను పూనుకోవటము లేదు. మానసిక శాంతిలేని మానవునకు, దేవ సంబంధమైన సదుపాయములు ఎన్ని

ఉండినప్పటికి తనకు ఆనందమును అందించలేక పోతున్నవి. సర్వరోగములకు కూడను మానసిక ఆశాంతియే మూలకారణము.

దీనిపై మానవుడు కొంత అశ్రద్ధచేతను అలక్ష్యము చేతను, సోమరి తనము చేతను మరింత రోగమును అభివృద్ధి కావించుకొనుచున్నాడు. మనకు లభించిన అంబలి, గంజి అయినా పరవాలేదు. వాటిని పరిశుద్ధమైన పాత్రలో ఉంచుకొని, సకాలములో భుజించటానికి ప్రయత్నించినపుడు అనారోగ్యమునకు ఏ మాత్రము అవకాశము ఉండదు. ఈనాడు మితాహారమనే దానికి స్వస్తి చెప్పి అమితాహారమనే దానిలో ఆనందమును అనుభవించుతున్నారు ప్రజలు ఈ భోజనమునకు ఏ మాత్రము కూడను ఒక హద్దు లేకుండ ఉంటుంది. తెల్లవారిన మొదలు రాత్రి పరుండు వరకును కడుపునకు ఏ మాత్రము విశ్రాంతి అందించుటలేదు. ఈ విధమైన ఆహారమును భుజించుట చేత అనారోగ్యమును అభివృద్ధి కావించుకొనుటయేగాక దేశమునకు కూడను ఒక ఆహార కొరతను కూడ అభివృద్ధి చేస్తున్నారు.

నిద్దురనుండి లేచి మరి నిద్దురపోయెడి దాక
పొట్టకై హద్దులు పద్దులేక వ్యయమందగ
చేయుచు జీవితంబు, మీ విద్దెల ధారవోసి
అరవింద దళాక్షుని విస్మరించి ఏ పెద్ద
సుఖంబు
నొందితిరో ప్రీతిగ యోచన చేయ మానవా!

కనుక మనము ఆహారము అంతో ఇంతో ఏర్పడిన అనారోగ్యమును మరింత బలపరచుకొంటూ వచ్చుచున్నాము. ఇంక మనము దేహరీతిగా కూడను కొన్ని రకములైన పరిశుద్ధతలు కొంత అభివృద్ధి కావించుకోవలెను. ఎక్కడ అశుద్ధమైనటువంటి వస్త్రమో లేక దేహమో ఇంక ఏ పరిసరప్రాంతములో చేరినప్పుడు, అక్కడ అనేక లక్షల క్రిములు చేరిపోవును మనకు కంటికి కనుపించనటువంటి క్రిములు కూడను యంత్రములకు కూడను గోచరముకానటువంటి కొన్ని కోట్ల క్రిములు మన యొక్క దేహము లోపల చేరిపోవుచున్నవి. దేహమునుంచి వెలుపలకు వచ్చుచున్నవి. మన దేహము కొంత అశుద్ధముగను లేక అశుభ్రత గాను ఉండినప్పుడు, ఈ క్రిముల యొక్క చేరిక మరింత అధికమగును. అందునిమిత్తమై ప్రతి మానవుడు కూడను రెండు వేళలనో లేక మూడు వేళలనో స్నానసంధ్యాదులు ఆచరించి దేహమును పవిత్రము కావించు కొని పరిశుద్ధము చేసికొనినప్పుడే ఈ క్రిముల యొక్క బాధను కొంత మనము తప్పించుకొనిన వారమవుతాము.

కాని ఆధునిక యుగము ప్రారంభమై అనేక విధములైన నవీన నాగరికతను అభివృద్ధి కావించుకోనే విద్యార్థులు అధికమై దానికి వింత వింతయైన, అతి విచిత్రమైన, ఘోరమైన. భయంకరమైన రోగములకు గురిఅవుతున్నారు మానవులు. మూడు నాలుగు పర్యాయములు స్నానము చేయువ్యక్తులను చూచి ఆధునిక యువకులు హాస్యము చేయుచున్నారు కాని ఇది ఆధునిక యుగము యొక్క ప్రభావమని భావించుచున్నారు. మేము సర్వవిధములైన సుఖములను, ఉపాయములను కనిపెట్టినామని వారు విఱ్ఱవీగుతున్నారు. నిజముగ ఆధునిక యుగములో ఉండిన యువకులకే అనేక రోగములు అభివృద్ధియగుచున్నవి. దుర్గుణములచేత ఏర్పడిన రోగముల కంటె అశుభము చేత ఏర్పడిన రోగములు అభివృద్ధి గావించుకొనుచున్నారు.

ఈనాటి ఆధునిక యువకులు, యువతులు, పురుషులు, స్త్రీలు కూడను స్నానము చేయటము, పండ్లు తోముకోవటము, అనాగరికతగ భావించుచున్నారు. మన దేహమునకు, ఆహారమునకు ప్రధానమైన సింహ ద్వారము నోరు శుభ్రముగా లేనప్పుడు ఎన్ని రోగములకైనా కూడన దేహము గురిఅవుతుంది. పండ్లు

సరిగా తోముకొనుటలేదు. నోరు పరిశుభ్రము చేసి కొనుటలేదు. దేహమునకు స్నానముచేసి పరిశుభ్రతను అభివృద్ధి కావించుకొనుటలేదు. ఇంక తనతల లోపలపైనుండి క్రిందపడేటటువంటి పురుగులు లెక్క లేకుండ ఉంటున్నవి. ఇది ఆధునికము యొక్క ఫేషన్ (Fashion) గాను హిప్పీల life గాను వారు భావించుతూ ఆనందమును అనుభవించు చున్నారు.

నిజముగ మనయొక్క దంతములను, జిహ్వను మనము పరిశుద్ధము చేసుకోలేని అ వ్యక్తుడైన బల హీనుడు తన జీవితమును ఏరీతిగా ఆదర్శముగా నిరూపించగలడు? కనుకనే తన యొక్క జఠరాగ్ని లోపల అనేక రకములైన క్రిములుచేరి తనను భయంకరమైన రోగముల దారికి లాగుకొనిపోవుచున్నవి. కనుక మనము ప్రప్రథమము లోపల మన దంతములను పరిశుద్ధము చేసికొని మన జిహ్వను పరిశుద్ధము చేసుకొని, పరిశుద్ధమైన మితమైన ఆహారములను భుజించటానికి ప్రయత్నము చేసినప్పుడు మనము ఎట్టి అనారోగ్యమునకు గురికాకుండా ఉంటాము. ఒక చిన్న ఉదాహరణము. అనేకమంది యువకులు ఈనాడు పండ్లుతోముకొనుటలేదు. తెల్లవారి లేచినది మొదలు ఆ పాచి ముఖముతోనే ఇడ్లి, దోసె, సాంబారు, మోరు కోలంబు అని అనేక రకములైన పదార్థములన్నియు కూడను ఈ పొట్ట అను కబంధునికి వేయుచు వచ్చుచున్నారు. అలాంటి వ్యక్తులు రెండు గజముల దగ్గరకు వచ్చి మాట్లాడుతున్న మనము ఉండటానికి ఇష్టముండదు. అంతా కంపు కొడుతుంది. ఇంకా పురుగులకెంత హాయిగా ఉంటుందో యోచన చేసికోండి. అనేకమంది చదువరులలో కూడ ఈ విధమైన దురభ్యాసము బయలు దేరినది. ఇంత చదువులు చదివి, ఇన్ని రకములైన పదవులలో ఉంటూ ఉండి ఆదర్శవంతమైన జీవితము ను అందించుకోలేని ఈ చదువరుల యొక్క చదువు లోకమునకు ఏమి ఉపయోగము?

మరికొన్ని దురభ్యాసములు మధ్య మధ్యపానీయం సమర్పయామి అని Smoking లు, పోగాకులు ఇలాటివి రావటం చేత కేన్సరు బయలుదేరుచున్నవి. క్రొత్త రకమైన రోగములు బయలుదేరుచున్నవి. పూర్వకాలము లోపల క్షయరోగముకాని, కేన్సరుకాని ఇసనోఫీలియాకాని, గుండెజబ్బులుగాని అధికముగా ఉండేటటువంటివి కావు ఇవి అన్నియు కూడను ఆధునిక యుగము ప్రారంభమైనప్పటి నుంచి కూడను ఆధునిక రోగములు ప్రారంభమైనవి. ఈ రోగములకు ఎన్ని నూతనమైన ఔషధములు అభివృద్ధి చేయుచున్నారో అంతకు రెండింతలు రోగములు కూడను అభివృద్ధి యగుచున్నవి. అధికమైన మందులచేతనే అధికమైన రోగములు మరింత అధికమగుచున్నవి.

కనుక హృదయ పరిశుద్ధము నిమిత్తమై దేహ పరిశుద్ధతను, మాట పరిశుద్ధతను, గుణ పరిశుద్ధతను ఇంద్రియముల పరిశుద్ధతను కూడను అత్యవసరముగ భావించటము, దానిని ఆచరించటము వాటిని అనుసరించటము, వాటితో అందుకోవటం అత్యవసరము కేవలము దేవుడా 'దేవుడా' అని కొన్నిసాధనలు చేసినంత మాత్రమున దైవానుగ్రమునకు మనము గురికాము. దైవానుగ్రహమునకు గురికావాలి అంటే దైవము అనుగ్రహించిన ఇంద్రియములను కూడను పవిత్రమైన మార్గము లోపల ప్రవేశింపజేసినప్పుడు దైవానుగ్రహమునకు గురిఅవుతాము. అమితమైన ఆశలను కొంతవరకు అణగద్రొక్కుకొని మితాశల చేత సంతృప్తిపడుతూ కొన్ని విధములైన సాధనలు కావించుకొంటూ సదాచారముచేత సాత్త్వికాహారము భుజించుటవలన చిరంజీవులుగా రూపొందుటకు ఎంతైనా అవకాశముంటుంది.

బాహ్య ప్రపంచమునందు అశుద్ధమైన కొన్ని గుంటలు మురికి కాలువలు ఏ విధముగా ఉండునో అదే విధముగనే అంతర్భావమైన ఆత్మ తత్త్వమునకు కూడను కొన్ని అపవిత్రమైన భావములు, దురహంకారములు, దుష్టచర్యలు, గుంటలుగా ఏర్పడుతూ ఉండును. సకాలమునకు భుజించుచు, సకాలమునకు నిద్రించుచు సరైన పరిశుద్ధమైన ఆహారము భుజించుట వలన అనారోగ్యమునకు ఏ మాత్రము గురికాము ఈనాడు సకాలమునకు భుజించుట ఏ మాత్రము జరుగుట లేదు కారణమేమిటి? ఎక్కడో క్లబ్బులకు, సినిమాలకు డాన్సులకు, డ్రామాలకు ఇలాంటి వాటికంతా తిరుగుతూ సకాలములో గృహమునకు చేరలేక పోవటము, లేక సకాలముకాని సమయములో ఏదో ఒక హోటల్లో చేరటము తినరాని తిండి తినటము తద్వారా ఆరోగ్యము పాడుచేసుకొనుట జరుగుచున్నవి. ఎప్పుడు సకాలమునకు మనము భుజించుటలేదో, సకాలమునకు నిద్రనుకూడ కోల్పోతాము ఈ నిద్రాహారములే మానవునికి ప్రధానమైన ప్రాణములు. ఇవి ఏమిటి? ఎందుకోసము! ఈ విధముగా పాటించ వలయును అంటే మానవుని యొక్క గమ్యము, మానవుని యొక్క దివ్యత్వమును తాను అనుభవించే నిమిత్తమై ఈ పవిత్రమైన దేహము పరమాత్ముడు అందించినటువంటి పవిత్రమైన బహుమతి. (gift)

జీవిత పరమావధిని పొందే నిమిత్తమై ఈ పవిత్రమైన కాయము మనకేర్పడినవి. పరమావధియొక్క సత్యమును మనము గుర్తించక పూర్వమే. ఈ కాయమును రోగములచేత నింపినప్పుడు మనము తిరిగి ఎన్నియో జన్మలు ఎత్తవలసి వస్తుంది; కాని ఒకే జన్మమునందైన అధిక కాలము జీవించి సమాజ సేవలు ఆచరించి మన జీవిత పరమావధి అయిన పరతత్వమును అనుభవించి ఈ ఆనందమును పరులకు పంచిపెట్టేటటువంటి పవిత్రవ్యక్తులుగా రూపొందించవలయును. కనుక ఇట్టి అలక్ష్యమునకు గురియైనటువంటి వారు సత్యమును గుర్తించలేనందులకు ఆసుపత్రులు అత్యవసరమని భావించి మన ప్రశాంతి నిలయములో ఒక ఆసుపత్రిని నియమించుట జరిగినది. అంతియేగాక ఒక్కొక్క మానవునికి, ఒక్కొక్క దానిపైన విశ్వాసము గాఢముగా ఉంటుంది. ఎంత దివ్యత్వము తనయందున్నప్పటికిని డాక్టరు ఔషధము అని చెప్పిన అమితమైన విశ్వాసము కలిగిన వ్యక్తులు అనేకమంది ఉంటారు. ఇవి అన్నియు కూడను వారి వారి విశ్వాసములపైన ఆధారపడియుండును. అంతే కాని డాక్టర్లు నిమిత్తమాత్రమే. నిజముగా డాక్టర్ల వల్లనే ప్రాణములు రక్షించుకోగలిగియున్న మన భారతదేశమునందే గాదు, ఏ దేశమందైనను ఒకే చక్రవర్తి ఉండేటటువంటి వాడు. వారికి డబ్బు లేకనా? డాక్టర్ల కొరత అయినారా! కాదు, కాదు. వారికి ఆయుఃప్రమాణము తప్పిన అనుట వలన డాక్టరు కేవలము ఔషధమును అందించగలడే కాని ఆయువును పెంచలేడు. ఆయుస్సును పెంచుకొనే టటువంటి దివ్యమైన శక్తి ఎవరికి వారిదగ్గరే ఉంటుంది.

ఆహార విహారములందు మానవుడు సక్రమమైన మార్గమును అవలంబించినపుడు, తనయొక్క ఆయుఃప్రమాణమును అభివృద్ధి కావించుకొనుటలో ఎట్టి అభ్యంతరము ఉండదు. కనుక దివ్యాత్మ స్వరూపులారా! మనయొక్క దేహము పవిత్రమైన జన్మము మానవత్వము. ఇట్టి మానవత్వము పవిత్రమైన మార్గములో ప్రవేశపెట్టి జీవిత పరమావధి అయిన ఆత్మ సామ్రాజ్య పట్టాభిషేకమును అనుగ్రహమును పొంది మనము కొంతవరకు జీవించి ఆదర్శవంతమైన జీవితమును లోకమునకు అందించవలయుననిన దేహమునకు తగిన పరిశుద్ధత ప్రమాణములను, పవిత్రతను కొంత

వరకు ఆచరించుట అత్యవసరమని గుర్తించవల యును.

దుర్గుణములను ఎంత దూరము చేసికొందుమో అంత ఆనందముతో మన ఆరోగ్యము కూడ అభివృద్ధి అవుతుంది. కాన మన అనారోగ్యమునకు మూల కారణము మన దుర్గుణములే అను సత్యమును ఈనాడు గుర్తించవలెను. అట్టి సద్గుణములను పెంపొందించుకొనే నిమిత్తమై ఇట్టి సత్సంగములో చేరటము. సత్కార్యములలో ప్రవేశించుట, సత్పురుషులయొక్క దర్శన, స్పర్శన సంభాషణల చేత మన జీవితములో చేసిన పాపములను కూడను పూర్తి నిర్మూలనము కావించుకొనుట జరుగుతుందనే ఆశల చేతనే ప్రాచీన కాలమునుండి ఇట్టి సత్సంగములు ఏర్పడినవి. ఎందుకనగా ఎలాంటి సమూహముతో చేరుదుమో, ఎలాంటి సమాజముతో కూడుదుమో అటువంటి భావములు మనలో చేరును Lawyerను చూచినపుడు మనకు కేసులు జ్ఞాపకము వచ్చును. డాక్టరును చూచినపుడు రోగములు మనకు జ్ఞాపకము వచ్చును. దేవాలయము చూచినపుడు దేవుడు మనకు జ్ఞాపకము వచ్చును. సత్సంగముతో కూడినపుడు సద్భావములు కూడను మనలో ఆవిర్భవించును. చెడ్డవారితో కూడినపుడు దుర్భావములు ఉప్పొంగిపోవును.

సముద్రుడిని చూచిన తక్షణమే ఏ విధముగా చంద్రుడు, చంద్రుని చూచిన తక్షణమే ఏ విధముగా సముద్రుడు ఉప్పొంగిపోవునో, ఆ విధముగా ఆయా గుణములు కలిగినటువంటి వారు, ఆయా గుణములు కూడినప్పుడే, చేరినప్పుడే, చూచినప్పుడే వారు కూడను ఆయా గుణములలో లీనమైపోతూంటారు.

సత్సంగత్వే నిస్సంగత్వం,
నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం,
నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః

అనగా, సత్సంగము చేత మన సద్భావములు పెంపొందింపజేసికొని తద్వారా ముక్తికి మార్గమును ఏర్పరచుకొనుటకు ఎంతైనా అవకాశము ఉండునని ఇందులో నిరూపించబడినది; ప్రేమ స్వరూపులారా! మనము చెడ్డ సంఘమును, చెడ్డ వ్యక్తులను మనము చూచినప్పుడు చక్కగా Goodbye చెప్పి, దూరముగా ఉండుట మంచిది, మంచివారిని, మంచి సంఘమును చూచి మన హృదయమును కూడను అర్పితము చేసి నమస్కరించి- వారిని అనుసరించటము అత్యవసరము. రేపటినుంచి అయినా కూడను, మన దేహములను, జిహ్వను మన దంతములను పరిశుద్ధ పరచుకొని, పవిత్రమైన ఆరోగ్యమును పెంపొందింపజేసుకొని, స్వామియొక్క ఆనందమును, స్వామియొక్క ఆశయములను శాశ్వత జీవితముగా ఉండి, అనుభవించటానికి తగినటువంటి కృషి చేయవలయునని నేను ఆశించుతూ, ఇంకా స్వామియొక్క లీలలు, స్వామియొక్క మహత్తరములు ఇంకా ఎన్నో, ఎన్నో, ఎన్నో జరుగుటకు అవకాశములున్నవి. ఇట్టివి మీరు చూచి తరించి, వరించి, భ్రమించి, మురిసేటటువంటి అవకాశమును అందుకొంటారని నేను ఆశించుచూ, ఆశీర్వదించుచు, ఈనాటి యొక్క కార్యక్రమమును విరమించుచున్నాను.

శ్రీవారి దివ్యోపన్యాసము. 8-10-1978
సాయంత్రము
వైద్యశాల వార్షికోత్సవము.

# ఆత్మతత్త్వము-దివ్యత్వము

ఎద్దికల దనుచుంటిమో ఆద్దిలేదు
ఏది లేదనుచుంటిమో అద్ది కలదు
ఉన్నదొక్కటే దైవంబు ఎన్నటికిని
లేని దయ్యది విశ్వంబు కానరయ్యా

మనము అనుభవించునది, మనము ఆనందించునది, అనేక రకములైన దృశ్యకల్పితమైన ఈ జగత్తు అంతయుకూడను సత్యమని భావించుకొనుట ఇది ఒక అజ్ఞానస్థితి. మనమందరము కూడినటువంటిదే ఈయొక్క లోకము. మనలో నడచుచున్నటువంటి కథయొక్క స్వరూపము, స్వభావముల ప్రతిబింబమే ఈ జగత్తు ఈ ప్రపంచమునందు జరుగుచున్నటువంటి కార్యమంతయు కూడను లోన జరుగుచున్నటువంటి కారణ తత్త్వమునకు ఒక విధమైన చిహ్నము ఈ కార్య కారణముల మధ్య జరుగుచున్నటువంటి తత్త్వమే పురాణము, ఇతిహాసము. ఈ పురాణములు ఎప్పటికప్పుడు నూతనమైన స్వరూపము ధరిస్తూ ఉంటది. ఇట్టి పురాణములయొక్క పవిత్రమైన చరిత్రను కూడను మనము అంతరార్థమును గుర్తించుకొనుట మొదటి ఘట్టము.

పురాణములందు ఇంద్రుడు, రుద్రుడు, చంద్రుడు అని ఇత్యాది పదములు అనేకముగా వింటూ ఉంటాము. వీరందరూ ప్రత్యేకించినటువంటి దైవములనియు మనకు వీరు వేరైనటువంటి వారనియు, మనము భావించుకొనుట ఇది కూడను అజ్ఞానము యొక్క తత్త్వము. ఇంద్రుడు కాని, రుద్రుడు కాని, చంద్రుడు కాని, వరుణుడు కాని సర్వ దేవతామయమైనటువంటి తత్త్వమే ఈ మానవ తత్త్వము. సర్వమును తనయందే ఉన్నది కాని, తాను ఈ ప్రపంచమునందు లేదు. దీని తత్త్వమును మనము గుర్తించుటకు కొంత ప్రయత్నము అవసరము.

ఇక్కడ ఇంద్రుడు అనగా ఎవరు? మన ఇంద్రియములకు అధిపతియైన మనస్తత్త్వమునే ఇంద్రియత్వముగా భావించుచున్నారు. ఇతనే ఇంద్రుడు, అనగా ఇంద్రియములకు అధిపతియైన స్వరూపమే ఇంద్రత్వము. ఇంద్రియములకు తాను అధిపతి కావటము చేతనే ఇతనికి ఇంద్రుడని ఒక పేరు వచ్చినది. కనుక మనస్సే ఇంద్రుడు. ఈ మనసు అనేటువంటిది ఇంద్రియములయొక్క సంపర్కము చేత ఇంద్రియానందమును అనుభవించే నిమిత్తమై ఇది ఏర్పడుట చేత ఇతనికి ఇంద్రుడని మరియొక పేరు. అనగా ఇంద్రియములతో కూడినప్పుడు ఇంద్రుడవుతాడు. ఇంద్రియముల యొక్క అంతర్భాగమునందు తాను అంతర్యామిగా జీవించు సమయమునందు తానే రుద్రుడుగా రూపొందుతాడు. మనస్సునకు ఇంద్రుడనియు, రుద్రుడనియు రెండు రూపనామములు కూడను ఏర్పడుతూ వచ్చినవి. కర్మేంద్రియములు ఐదు, జ్ఞానేంద్రియములు ఐదు. ఈ రెండింటియొక్క సమూహమే దశేంద్రియము. ఈ దశేంద్రియములకు

తాను నాయకుడు కావటము చేత, ఇతనికి పదకొండవ దేవతగా భావించుతూ, పదకొండవ శక్తిగా నిరూపించుతూ వచ్చినది. అనగా ఇంద్రుడు, రుద్రుడు ఒక్కడే కనుకనే ఇక్కడ ద్వాదశ ఆదిత్యుడు అనే టటువంటి తత్త్వమునకు ఏ మాత్రము అవకాశము లేదు.

ఇక్కడ మనయొక్క దైవతత్వమును మానవత్వమును కొంత గ్రహించవలసినది ఆవసరము, మానవుని యందు ఉన్నటువంటి లోకతత్త్వమునే ఒకే విధమైన మానవత్వముగా భావించుతూ అందులో ఉన్నటువంటి దివ్యత్వమునే దైవత్వముగా విశ్వసించుచూ దివ్యత్వము మానవత్వము ఒకే ఒక నరత్వమునందు ఏర్పడినటువంటివనే సత్యమును కూడను మనము విచారించవలెను.

జీవుడనే దేహమందు, హృదయమందు
దేవుడుండు
రెండుకూడి ఆటలాడి ఒకరి నొకరు
వీడుచుండు
బొమ్మలాట లాడించే సూత్రధారి ఒకడు
ఉండు
కాని రెండుకూడి ఆటలాడి ఒకరి.నొకరు
వీడుచుండు
చూడ రెండ ఉండినప్పటికిని ఒకటిలోన
రెండుఉండు.

మానవత్వము దైవత్వము అనేటటువంటివి ఏకత్వములో కూడినటు వంటిదేకాని, భిన్నత్వములో చేరినటువంటిదికాదు కనుక యీ యొక్క ఇంద్రత్వము, రుద్రత్వము, యిలాంటి బ్రహ్మత్వము అనేటటు వంటిది ఒక్క మానవత్వములో ఉన్నటువంటి అంశములే తప్ప అన్యము కాదని మనము గుర్తించవలెను.

ఆకాశమునందలి మనస్సు యొక్క ఒక్క భాగము యీ ఇంద్రుడు. ఇట్టి ఇంద్రుడిని అన్ని దేవతలతో పాటు అప్పుడప్పుడు యీ యజ్ఞమునందు జీవత్వము నందు ఆహ్వానము జరుగుతూ వస్తూంటాడి. ఈ యజ్ఞమునందు అన్ని దేవతలతోపాటు ఇంద్రుడిని కూడను ఇక్కడ పిలుస్తూంటారు. కనుకనే యితనికి పురుహూతుడని ఒక పేరు. అనగా, పురు అనగా అనేక పర్యాయములని అర్థము. హూతుడనగా ఆహ్వానించబడువాడు. అనేక పర్యాయములు జీవునియందు ఆహ్వానింపబడిన వాడు కనుకనే యితనికి పురుహూతుడని ఒక పేరు.

ఇలాంటి పురుహూతునికి ఒక విధమైనటు వంటి వజ్రచక్రము ఉంటున్నది. దీనిని దశారము, శతారము, సహస్రారము అని మూడు పద్ధతులలో ఉండును. దశ అనగా పది. అరములనగా అంచులు. అనగా యితనికి కలిగినటువంటి వజ్రములు ఏమిటనగా దశేంద్రియములు, ప్రకాశించేటటువంటి అంచులలో కలిగిన కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములే యితనికి వజ్రములు. దీనిని యోగిస్వరూపమును ధరించినపుడు యోగితత్త్వమును అనుభవించినపుడు యోగిస్థానమును తాను అనుభవించినపుడు ఇక్కడ ఒక విధమైన తేజోవంతమైనటువంటి కళలతో రూపొందించుటచేత ఇక్కడ శతారము అని కొన్ని కళలు ఏర్పడును. ఇంద్రియములను సాధించినటు వంటి వ్యక్తియొక్క తత్త్వమునకు శతారమనికూడను పిలువవచ్చును. ఇంకా సహస్రారము అనగా తన యొక్క జీవితమును సత్యమును గుర్తించుటచేత యిక్కడ సహస్రార చక్రమని స్థానమునందు సహస్రారము అని పిలువబడుచున్నది. కనుక ఈ దశారము, శతారము, సహస్రారము ఇవి అన్నియు కూడను కేవలము ఏదో ఇంద్రుని యొక్క అస్త్రము

లనియు, ఇంద్రుని యొక్క వజ్రములనియు, ఇంద్రుని యొక్క సుదర్శనములనియు ఈ రకముగా మన చరిత్రలు తెలుపుచూవచ్చినవే కాని ఇందులో ఉన్నటువంటి అంతరార్థములు సర్వము మానవుని యందు యిమిడి యున్నటు వంటిదే.

కనుక యీవిధముగ పురాణముల యొక్క అంతరార్థమును విచారించినపుడు, మానవుని కంటే మించినటువంటి శక్తి మరొకటి లేదని స్పష్టమగుచున్నది. ఇట్టి విలువైన ఘనమైన పవిత్రమైన వజ్రమువంటి ఈ మానవత్వమును మనము మసిబొగ్గులకు అమ్ముకొనుటకు ప్రయత్నము చేయుచున్నాము. ఇంద్రియములయొక్క అనుభూతులుకాని లేక ప్రపంచముయొక్క ఆనందముకాని, జీవితము యొక్క సౌభాగ్యముకాని మనము సత్యము నిత్యముగ భావించుకొనుట ఇది ఒక విధమైన అజ్ఞానతత్త్వము. మనతో ఉన్నటువంటి మానవత్వమును, మనలో ఉన్నటువంటి జీవాత్మను మనము ఏనాడు మరతుమో ఆనాడే మనలో ఉన్నటు వంటి దివ్యత్వము ప్రకటించును. దీనినే పురాణముల యందు, బలిచక్రవర్తి చరిత్రయందు మనకు స్పష్టము చేయుచూవచ్చినది. ఇందులో మానవ తత్త్వమునే బలిచక్రవర్తిగా విశ్వసించి దైవత్వమునే వామనమూర్తిగా ధరించి ఈ మానవత్వమనేటటువంటి దానిని విసర్జించి భగవదర్పితము కావించుట చేత తనకు దివ్యత్వమనేడటువంటి విష్ణుత్వము ప్రాప్తించినదని చరిత్ర కూడ నిరూపించినది. ఇతని త్రివిక్రముడని పేరు పెట్టుతూ వచ్చారు.

భూలోకము, భువర్లోకము, సువర్లోకము ఈ మూడు లోకములు కూడను విష్ణువు యొక్క తత్త్వమే ఆవరించినదని బలిచక్రవర్తి యొక్క చరిత్ర బోధిస్తూ వచ్చినది. భూలోకమనగా పంచ భూతములకు గోచరమయ్యేటటువంటిది. పంచేంద్రియములతో కూడినటువంటిది. మనయొక్క దేహమే భూలోకముగా భావించుతూ వచ్చినారు. దీనికి చుట్టూ ఉన్నటు వంటి ప్రాణతత్త్వమునే భువర్లోకముగా నిరూపించుతూ వచ్చినది. ప్రతి అణువునందు కూడను సర్వాంతర్యామి తత్త్వమును నిరూపించుతూ వచ్చినది. సువర్లోకము భూలోకము, భువర్లోకము. సువర్లోకము అంటే ఒకదానికంటే ఒకటి పై అంతస్థులో ఉండినట్లు మనము భావించుచున్నాము. అది చాల తప్పు. మూడు ఒకదానితో ఒకటి చేరినటువంటివే కాని ఒకదాని కంటే ఒకటి అంతస్థును మించునటువంటివి కావు. ఇదియొక Table అని మనము అనుకొన్నప్పుడు టేబులుయొక్క దృశ్యమును మనము చూచుచున్నప్పుడు ఇందులో చేరినటువంటి కఱ్ఱ మనకు కనిపించదు. ఈ టేబుల్, కఱ్ఱ, రెండూ చేరి ఒకటే అయినవే కాని ఇవి అంతస్థులుగా లేవు. అదే విధముగనే భూలోకము, భువర్లోకము, సువర్లోకము అనేటటు వంటితత్త్వము మనతో ఉన్నటువంటిమూడు స్థాయిలు మాత్రమే. ఈ మూడును కలిసినప్పుడే దివ్యత్వముగా రూపొందుతూ వచ్చును. దీనినే దేహతత్త్వము, ప్రాణతత్త్వము, ఆత్మతత్త్వము అని ప్రబోధిస్తూ వచ్చినది పురాణము. దీనినే అనేక పర్యాయములు కూడను చెప్పుతూ వచ్చినాను.

You are not one person, but three
The one you think, you are
The one others think you are
The one you really are

ఇదే మనయొక్క దేహతత్త్వము, ప్రాణతత్త్వము, ఆత్మతత్త్వము. నీవు ఆత్మతత్త్వమునందు లీనమైనపుడు, ఆత్మ పవిత్రతను నీవు కనుగొన్నప్పుడు, ఆత్మతత్త్వమును నీవు నిరూపించినపుడు ఈ దేహతత్త్వము, ప్రాణతత్త్వము ఏ మాత్రము ఊహించు

టకు వీలుండదు. నీవు కేవలము ఈ దేహతత్త్వము నందే కాలమునంతా అంత్యముగావించుట చేత నీ మనస్సు యొక్క ప్రవర్తన, ప్రవృత్తులు అంతయు ఈ మనస్తత్వమునందే లీనమైనట్టు చేత, ఆత్మతత్త్వమును గుర్తించుటకు శక్తిసామర్థ్యములు కోల్పోతున్నాము. కఱ్ఱ, కఱ్ఱ అనుకున్నంత కాలము కూడను నీవు టేబుల్ గుర్తించుటకు వీలు కాదు. నీవు టేబుల్, టేబుల్ అని చూచునంతవరకు కూడను నీకు కఱ్ఱ గుర్తు రాదు. అదే విధముగా నీవు మానవుడు, మానవుడు అని చింతించినంత కాలము నీకు ఆత్మతత్త్వము అర్థము కాదు. నేను ఆత్మను. ఆత్మను అనేటటువంటి యదార్థమైన స్థాయికి నీవు చేరవలెను. దీనికి ప్రాపంచిక సంబంధమైన ప్రవృత్తులు, అనుభూతులు అత్యవసరము. ఇటువంటి పవిత్రమైన అంతరార్థమును ప్రబోధిస్తూ వచ్చినవి మన ప్రాచీనమైన పురాణములు.

పురాణములనగా కేవలము కల్పితమైనటువంటివిగా భావించుకొని, వాటిని అలక్ష్యము చేసి మన జీవితమును నిరర్థకము చేసుకొనుచున్నాము. మనయొక్క వాక్కుగాని, క్రియలుగాని, మనయొక్క మనస్తత్వముగాని దీని హద్దులకు మీరిపోవుటకు వీలు కాదు. వీటి అన్నింటికిని అతీతమైన తత్త్వమే ఆత్మతత్వము. దీనినే అనిల్‌కుమార్ చెప్పాడు. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాస్సహా" మనస్సునకు గాని, వాక్కునకు గాని ఏ మాత్రము తెలియనటువంటి, గోచరము కానటువంటి, అతీతమైనటువంటి తత్త్వమే భగవత్ తత్త్వము అని.

మనదేహము పవిత్రమైనటువంటి భగవంతుని యొక్క రథము. ఇట్టి దివ్యమైనటువంటి రథమును నిరుపయోగపరచి, దుర్వినియోగపరచి దీనిని దుర్మార్గము నందు వ్యర్థము గావించుకొనుట ఇది మహా పాపము. ఈ దేహము చేత పవిత్రమైన కర్మలు ఆచరించి సహజసేవలు సల్పి సర్వేశ్వర కర్తలు ఆచరించి దీనిని సార్థకము కావించి సత్కర్మలలో ప్రవేశపెట్టవలెను. దీనినే భక్తి, జ్ఞాన, వైరాగ్యము లని చెప్పూవచ్చినారు. ఈ అన్నింటికిని కర్మ ప్రధానమైనటు వంటిది, వేదమునందు కూడను కర్మాకాండలు ప్రధానముగ నిరూపించినవి కాయభావము ఉండినంత వరకు కూడను కర్మభావము మనకు తప్పినది కాదు ఈ కర్మకాయము రెండూ ఆచరించినంత వరకు కూడను కాలము పవిత్రము చేయక తప్పదు. కాలకర్మకారణములను పవిత్రము కావించుకొనే నిమిత్తము ఈ కాయమేర్పడినటు వంటిదని సత్యమును గుర్తించుట అవసరము.

ప్రతి కార్యమునకు కూడను ఒక కారణము ఉంటున్నది. లోపల కారణములేక బయట కార్యము జరుగుటకు వీలుకాదు. కనుక కార్యము ప్రతిబింబము. కారణము బింబము. ఈ బింబ ప్రతిబింబముల యొక్క సంబంధము గుర్తించుకొనేటటు వంటి ప్రయత్నమే ఈ ఆధ్యాత్మిక మార్గము. కనుక మనము ఏదేవతను పూజించినప్పటికిని, ఏ దైవమును ఆరాధించినప్పటికిని మన కంటే వెలుపల భాగములో ఉన్నట్లుగా భావించుకొనుట చాలపొరపాటు. దైవము మనయందే ఉంటున్నది. దైవత్వము మనలోనే ఆవిర్భవించుతున్నది. ఈ దివ్యత్వమును గుర్తింపు ప్రయత్నమునకు కొంతశ్రద్ధ అవసరము, 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్' ఈ శ్రద్ధలేక ఎట్టి కార్యములు కూడను సాధించలేము. ఆయాస్థాయిలను పురస్కరించుకొని ఆయానిష్ఠలను ఆచరించుటలో ఎట్టి అభ్యంతరము ఉండదు.

ప్రేమస్వరూపులారా! నిజముగ మన పురాణములు అందించేటటువంటి అంతరార్థములను చక్కగా గుర్తిం

చుటకు తగినటువంటి శక్తిసామర్థ్యములను మనము అభివృద్ధి పరచుకొనుట లేదు. కేవలము శ్రవణము చేయుట జరుగుచున్నది కాని, దీనిని మనన, నిధి ధ్యాసల లోపల అభివృద్ధి కావించుటకు తగిన కృషి సలుపవలెను. కనుక ప్రతి పురాణమునందు ఉన్నటువంటి అంతరార్థమును మాత్రమే గుర్తించవలెనుకాని, కేవలము బాహ్యాచారములు, బాహ్యపద్ధతులు, బాహ్య ఆడంబరములు వీటియందే మన కాలమును వ్యర్థము కావించి, జీవితమును నిరర్థకము కావించుకొనకూడదు. విన్నవాటిని ఒకటి, రెండు అయినకూడను ఆచరణ యందుంచి తగినటువంటి అనుభూతిని అందుకొనుటకు తగిన కృషి చేయవలయును. ఈ విధముగా కొంత ప్రయత్నము చేసి ప్రాప్తించినటువంటి పవిత్రమైన మానవజన్మమును మనము సార్థకము గావించుకొనవలెనను సంకల్పమును ధృఢపరచుకొనుట అవసరము. దైవత్వము కంటే మరొక పదార్థము ఈ జగత్తునందు కనిపించుటలేదు. కనిపించేటటువంటి వన్నియు కూడను దైవత్వము యొక్క అంశములే తప్ప అన్యము కాదు. ఇలాంటి అంశములయొక్క తత్త్వమును స్వస్వరూపము లోపల మనము నిరూపించుటకు తగిన కృషి సలుపవలెను.

శ్రీవారి దివ్యోపన్యాసము
6-10-78'



## పుస్తకములు

| | పేరు | వెల | తపాలా ఛార్జి |
|---|---|---|---|
| 1 | అద్భుత మూర్తి-(హవార్డ్ మర్ఫేట్ ఆంధ్ర అనువాదం-అమరేంద్ర) | 6-00 | 0-10 |
| 2 | రామకథా రసవాహిని | 9-00 | 0-60 |
| 3 | జ్ఞానవాహిని | 1-50 | 0-10 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-30 |
| 5 | సత్యం శివం సుందరం (2) | 5-00 | 0-25 |
| 6. | సత్యం శివం సుందరం (3) | 5-00 | 0-25 |
| 7 | శ్రీ సత్యసాయి భగవల్లీల (ఉప్పాడ రాజారావు) | 1-50 | 0-15 |
| 8. | సూక్తి రసతరంగిణి (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 9. | శ్రీ సత్యసాయీశ్వర నుతి తరంగిణి (1) (ఉప్పాడ రాజారావు) | 3-00 | 0-35 |
| 10. | శ్రీ సత్య సాయీశ్వర నుతి తరంగిణి (2) (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 11. | సుధాబిందువులు | 5-00 | 0-30 |
| 12. | సువర్ణ సుమమాల | 5-00 | 0-30 |
| 13. | సత్యసాయి వచనామృతం (2) | 4-00 | 0-25 |
| 14. | భజనావళి | 2-00 | 0-20 |
| 15. | భాగవతవాహిని | 3-00 | 0-25 |

ఆంధ్ర రాష్ట్రము, హైదరాబాదులోని ప్రోగ్రెసివ్ ప్రెస్ ప్రయివేట్ లిమిటెడ్ యందు, బి. వి. సత్యమూర్తిచే ముద్రింపబడి, యన్. కస్తూరిచే, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం తరఫున ప్రచురింపబడినది. ఎడిటర్ : యన్. కస్తూరి, యం. యె., బి. యల్.

# శ్రీసత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం,

అనంతపురం జిల్లా. ఆంధ్రప్రదేశ్. పిన్ నం. 515134.

## పత్రికలు / పుస్తకములకు ఆర్డర్లు.

A (1) పత్రికలు : ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువ కానీ స్వీకరింప బడవు.

| ఇండియా | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 6 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 6 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 4 రూ. |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్. |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘానిస్థాన్ | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| ఆఫ్రికా | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| అమెరికా | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 16 | 31 | 9 | 14 | 9 | 14 |
| ఆస్ట్రేలియా | 16 | 46 | 9 | 20 | | 20 |
| బర్మా | 16 | 26 | 9 | 12 | | 12 |
| యూరోప్ ఖండపు దేశములు | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 16 | 51 | | 20 | 9 | 20 |
| శ్రీలంక | 8 | 21 | | 10 | 8 | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏ భాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలెను. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రసు నందు మార్పు అవసరమని తెలుపు సమయమునందును చందా నంబరును వ్రాసి పంపవలెను.

B(1) పుస్తకములు : ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు, ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన. రిజిస్టర్ ఛార్జీ రూ. 2-25 లు మీ ఆర్డర్‌తో పంపవలసియున్నది. V.P.P. ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డర్‌లోనే తెలుపవలెను.

(3) ఫోటోలు/చిత్రములు పోస్టులో పంపుటకు వీలు కాదు.

(4) కార్యాలయము నుంచి వివరములు తెలుసుకోవలెనన్న మీ చిరునామా గల స్టాంపు వేసిన కవరును పంపవలెను.

(5) పుస్తకముల ఆర్డర్లు—విదేశములనుంచి తపాలా ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను.

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్ యొక్క చిరునామాకే పంపవలెను. మనియార్డర్ పంపువారు వెనుక భాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా వ్రాయవలెను.

( పుస్తక సూచి : 48 వ పుటలో చూడండి )

మనము ఈ వాంఛలను తగ్గించుకోవటం ఎట్లు? వాంఛలు తగ్గించుకోనక్కరలేదు, సర్వ వాంఛలు కూడను భగవంతునివైపు మరల్చటానికి ప్రయత్నము చెయ్యటమే సరియైన సులభోపాయము. ఏమి ఆశించినా, ఏమి చేసినా, ఏమి చూసినా అంతా భగవత్ప్రీత్యర్థమనే సత్యాన్ని గుర్తించుకుంటే, ఇంతే చాలు. ఇది సులభమైనటువంటి మార్గము. అందరియందు ఉన్న ఆత్మ స్వరూపుడు ఒక్కడే అనే సత్యాన్ని కూడను మనము ప్రయత్నము ద్వారా సాధించాలి. దేనినిగానీ సాధించాలనుకున్నప్పుడు ప్రయత్నమో, సాధనో లేకపోతే మనము ఏ మాత్రము కూడను ఆ కార్యమును సాధించలేము. లౌకికంగా గానీ, పారమార్థికంగా కానీ ప్రయత్నము చాలా అవసరము. నడచడానికి ప్రయత్నము చేస్తే చీమైన కొన్ని మైళ్లదూరము పరిగెత్తవచ్చు. కానీ ఎగరడానికి ఇష్టము లేకపోతే గ్రద్దైనా ఒక ఇంచైనా ముందుకు పోలేదు. కనుకనే "సాధనమున పనులు సమకూరు ధరలోన". మనము కొంతవరకును ప్రయత్నపూర్వకంగా సాధనలు సాధించినప్పుడే దీని యొక్క ఫలసిద్ధిని అందుకొనటానికి అధికారులమవుతాము.